# SIVA LEELA VILASAMU

BY

**Kuchimanchi Timma Kavi.**



**V. RAMASWAMY SASTRULU & Sons,**

**292, Esplanade**
**323, Tondiarpet** **MADRAS.**

# ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ |
|---|---|
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు ... | 0 |
| భోగినీదండకము, బమ్మెర పోతరాజప్రణీతము | 0 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) ... | 0 |
| డిటో గట్టుప్రభువుకృతము ... | 0 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము ... | 0 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కని ప్రతి ... | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక, (భాగవతము) ... | 0 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు ... | 0 |
| రూపలి, రాజపుత్రస్త్రీసాహసపుకథ, శ్రీ ఎ. వమంద్ర నారాయణమూర్తిగారిది | 0 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది ... | 0 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు ... | 1 |
| నలచరిత్ర, ద్విపద ... | 0 |
| తిలకుగారి సెక్యూరిటీకేసు ఉపన్యాసములు ... | 0 |
| మదనమోహన మాళవ్యగారి జీవితము పంజాబుఅల్లరి ... | 0 |
| యజుర్వేదకథాసంగ్రహము ... | 0 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము, వేంకటరంగశాస్త్రికృతము ... | 6 |
| డిటో 3 వాల్యములు ,, ... | 7 |
| శ్రీవివేకానందవిజయము ... | 1 |
| ప్రాచీనదేశ చరిత్రలు ... | 1 |
| భారతరమణీమణులు ... | 0 |
| సంగ్రహరామాయణము, శ్రీ శేషాద్రిశర్మకృతము ... | 0 |
| శ్రీమహాభక్తవిజయము ... | 4 |
| సుశీల | 0 |
| హితోపదేశము, సులభశైలి ... | 0 |
| సంస్కృతనాటకకథలు, శ్రీ సీతారామశాస్త్రికృతము ... | 1 |
| దశకుమారచరిత్రము: ఎవమచింతల సంజీవరాయశాస్త్రికృతము ... | 1 |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు ... | 0 |
| భోజకాళిదాసకథలు, 1-వ భాగము ... | 0 |
| దక్కనుపూర్వకథలు, శ్రీ సీతారామశాస్త్రికృతము ... | 1 |
| శ్రీగ్రక్వాయిగారి ఉపన్యాసములు ... | 0 |
| సూరతుకాంగ్రెస్సు ఉపన్యాసములు ... | 0 |
| శ్రీలాలాలజపతిరాయిజీవితము ... | 0 |

శ్రీ ర స్తు.

# శి వ లీ లా వి లా స ము.

కూచిమంచి తిమ్మకవికృతము.



చె న్న పు రి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచేఁ

ప్ర క టి త ము.

1921

శ్రీరస్తు.

# శివలీలావిలాసము.

## ప్రథమాశ్వాసము.

### ఇష్టదేవతాప్రార్థనము.



నగజాఘనస్తనవిస్ఫుర్త్వరసంకుమద్రైణాంకాభిపం
కౌస్తిశవాసితస్ఫుటభుజాంతరుఁ డిందుసుధాపయస్సదృ
గ్భానుతకీర్తిపీతపురకుక్కుటలింగమహాప్రభుం డశే
షానతభక్తపాలనపరాయణుఁ డీవుత మా కభీష్టముల్. 1

క. మగనిసగమేన నెలకొని, ముగురంబలయందు నాదిమూలం బగుచున్
జగమేలుసర్వమంగళ, జగమే లిడుఁగాత మాకు సమ్యక్కరుణన్. 2

ఉ. శ్రీరమణీశమేశ్వరులఁ జిత్తమునం గదియించి భారతీ
సారసగర్భుల న్మిగుల సంస్తుతిఁ జేసి మతంగజాననున్
స[illegible]సఁ గొల్చి దెందులూరిసత్కులపావను లింగనార్యు నిం
పారఁ దలంచి మున్నిటిమహాకవుల న్భజియించి వేడుకన్. 3

### కవివంశాభివర్ణనము.

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతుండఁ గూచిమంచ్యన్వయాంభోధినీహారకరుఁడ
గంగనమంత్రిశేఖరునకు నంగనామణి యగులచ్చమాంబకును సుతుఁడ
బహుకార్యనిర్మాణబంధురప్రతిభుండఁ గుక్కుటేశ్వరకృపాపూరలబ్ధ
సత్కవితామహాసామ్రాజ్యభారధౌరేయుఁడ బుధజనప్రియచరితుఁడ
తే. దెందులూరిలింగనారాధ్యదేశికేంద్ర, దత్తమాహేశ్వరాచార్యవృత్తిరతుఁడఁ
గందరాడఘనగ్రామమందిరుండఁ, దిమ్మకవిచంద్రుఁ డనుజగద్విశ్రుతయశుఁడ. 4

సీ. ప్రౌఢిమై రుక్మిణీపరిణయంబును సింహశైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కథయును రాజశేఖరవిలాసంబును నచ్చతెనుంగు రామాయణంబు

సారంగధరనరేశ్వరచరిత్రంబు సప్తార్ణవసంగమమాహాత్మ్యకంబు
రసికజనమనోభిరామంబు లక్షణసారసంగ్రహము సర్వపురస
తే. మంచితక్షేత్రకథనంబు మఱియుఁ బెక్కు, శతకదండకసత్కృతుల్ ప్రతిభఁగూర్చి
యుల్లమలరారఁ బార్వతీవల్లభునకు, భక్తి నర్పణఁ జేసినభవ్యమతిని. 5

వ. ఇట్టినేను మదభీష్టదైవతం బైనకుక్కుటేశ్వర శ్రీమన్మహాదేవునకు నంకితంబుగా మఱియు నొక్కప్రబంధంబు రచింపం దొడంగి. 6

## షష్ఠ్యంతములు.

క. సర్గాపసర్గఫలదుని, దుర్గునకుఁ భర్గునకుఁ బ్రశమితమహాంహో
వర్గునకు సూరినుతస, న్మార్గునకు మనోజ్ఞసానుమద్దుర్గునకున్. 7

క. అంభోజాసనముదసం, స్తంభునకున్ శంభునకు నుదంచితకరుణా
రంభున కఖిలావనసం, రంభునకున్ ముదితమానిరాడ్డింభునకున్. 8

క. సర్వసుపర్వకదంబక, పూర్వునకున్ శర్వునకును భుజబలలీలా
ఖర్వునకు శమితయమరా, డ్గర్వునకు మహోక్షరాజగంధర్వునకున్. 9

క. బాణాదిభక్తజనసం, త్రాణునకున్ స్థాణునకు నుదంచదుదన్వ
త్తూణునకు సరసిజేక్షణ, బాణునకున్ సత్యవాక్యపరిమాణునకున్. 10

క. సామజదానవదర్పవి, రామునకున్ సోమునకును రజతమహీభృ
ద్ధామునకుఁ గోటిదినకర, ధామునకు మహోగ్రసమరతలభీమునకున్. 11

క. పురదైతేయస్మరసం, హరునకు వరునకు నిరంతరాత్యంతదయా
పరునకుఁ బీఠాపురమం, దిరునకు శ్రీకుక్కుటేశదేవవరునకున్. 12

వ. సమర్పణంబుగా నారచియింపం బూనినశివలీలావిలాసం బనుశృంగారరసప్రబంధంబునకుం గథావిధానం బెట్టిదనిన. 13

## కథాప్రారంభము.

గీ. హస్తిపురమున నొక్కనాఁ డర్జునుండు, భీష్ముఁ గన్గొని మ్రొక్కి సంప్రీతిఁ బలికెఁ
దాత నిన్నొక్కపుణ్యకథాప్రసంగ, మడుగఁ గోరెదఁ గృపతోడ నాన తిమ్ము.

క. నీ వెఱుఁగనిపుణ్యకథల్, త్రోవలయమునందు లేవుగద యైనన్
భావింపఁగ నఖిలజగ, త్పావని యగుగంగమహిమఁ బ్రతిథం జెప్పుమా. 15

ఆ. శివుఁడు గంగ నేల శిరమున నిడుకొనె, గంగ విష్ణుపాదకమలమున జ
నించు టెట్లు తాత నిక్కంబుగా నిది, తేటపడఁగ నాకుఁ దెలుపవలయు. 16

వ. అదియునుం గాక. 17

గీ. కలఁగఁ గొందఱు జాలరికన్నె యనుచు, నెన్నుచుందురు రమ్మాట యేర్పడంగ
వినఁ దలంచెద నమ్మహావేణి కీవు, కూర్మి పట్టి విగద లసద్గుణకలాప. 18

గీ. అనిన గాంగేయుఁ డప్పాండుతనయుఁ బలికె, వత్స నే మున్ను నారదువలన విన్న
తెఱఁగు నీకిప్పు డెలమితో నెఱుఁగఁ జేతు, నింపు దైవార విను మని యిట్టులనియె.

ఆ. మొదలఁ గమలగర్భుఁ డుదకంబుల సృజించి, వీర్య మందులోన విడిచె నది స
హస్రకరనిభప్రభాంచిత మై హిర, ణ్యస్వరూప మైనయండ మయ్యె. 20

వ. ఆయ్యండంబునందుఁ జరాచరాత్మకం బైనసకలప్రపంచంబు సృజియించి వృద్ధిఁ బొందింపుచుండె నంత. 21

గీ. మూషకాసురుఁ డనుసురద్వేషి యొకఁడు, దూఱియయ్యండమున నొకతూటు వొడిచె
నందువలన మహోదకం బద్భుతంబు, మీఱఁ బెనువెల్లి యై చొచ్చి పాఱుచుండె.

క. ఆవెల్లి జగము లన్నియు, వేవేగ న్ముంచి జంతువితతికి నెల్లన్
వావిరి నుపద్రవంబుల్, గావింపుచు నున్న నీలకంఠుఁడు పేర్మిన్. 23

గీ. జగదుపద్రవశాంతికై తెగిలి మున్ను, కాలకూటంబుఁ గంఠభాగమున నిడ్డ
చందమున నమ్మహాంబునిర్ఝరము నెలమిఁ, దనజటాజూటవీథి నందముగఁ దాల్చె.

గీ. అపుడు గంగ మహేశుజటాగ్రవీథిఁ, బట్టఁజాలక యుప్పొంగి పైకిఁ బొరలి
ఘనతరంగిణి యై దూఱి కమలజాండ, వివరమునఁ బాఱె జగదుపద్రవము గాఁగ.

గీ. హరియు నయ్యెడ మూషకాసురు వధించి
తనపదాంగుష్ఠ మబ్జజద్వారసరణి
నునిచి నీ రాఁచె నందునుండి యూఁట
యించుకాలోపలికిఁ బ్రవహింపుచుండె. 26

వ. ఆప్రవాహంబు సకలభువనంబులఁ బవిత్రంబుగా గంగాభవాని యేకార్ణవంబుగ జగంబు లన్నియు ముంచి లోజంతుకోటిజలచరంబుల క్రియ మించి చెలంగి పొంగి. 27

క. తనకెదు రెవ్వరు లే రని, మనుకొని గర్వాతిరేకమునఁ బలికిన య
వ్వనితారత్నముఁ గనుఁగొని, కినుక మదిం బెనఁగొనంగ గిరిశుఁడు పలికెన్. 28

గీ. ఆఁడుదానవు నీ కిట్లు లబ్బురంపు, గర్వ మేటికి నాచేతఁ గమలసంభ
వాదులును మున్ను గర్వించి యడఁగి చనిరి, గర్వ మెంతటివారికిఁ గాదు సుమ్ము.

క. భూచక్రంబున కిప్పుడె, నే చని నీ వందు మత్స్యవిక్రయవృత్తిన్
బ్రాచుర్యంబుగ మనియెదు, నీచకులంబున జనించి నిలువుము చెలియా. 30

గీ. అనిన నడలొంది గంగ యోయనఘచరిత, తప్పు సేసితి లోఁగి నీదయ దలిర్పఁ
గాచి రక్షించు మన్నదఁ గాఁక యుడఁగ, నిన్ను నెడఁబాసి క్షణమైన నిలువఁజాల.

క. నావుడు శంకరుఁ డిట్లను, నీ వటువలెఁ గొన్నినాళ్లు నిలిచినపిదపన్
దేవత లెన్నఁగ నిన్నుఁ, దే వేగఁ బెండ్లియాడి తెచ్చెద మరలన్. 32

వ. అని పరమేశ్వరుం డానతిచ్చిన నట్లనె గంగాభవాని దాసకులకన్యాస్వరూపంబు ధరియించి భూలోకంబునకు వచ్చి పారావారతీరంబున మహేశ్వరుం గురించి తపం బాచరింపుచుండె నంత. 33

సీ. శంఖదేవుం డనుజాలరి గేస్తుండు తనబంధువుల దానుఁ దవిలి యొక్క
నాఁడు దా నెలూరినగరంబునందుండి జలధికి వేఁటాడఁ జని యొకయెడఁ
దపము సేయుచు నున్నతరళాయతేక్షణఁ జిన్నికన్నియఁ జూచి చేరఁబోయి
తల్లి నీ వెవ్వరిదానవు కుల మెద్ది తలిదండ్రు లెవ్వారు కులము పేరు
గీ. నెద్దితప మేలచేసెద విచట నిట్లు, సరసిజానన నాకు నీచంద మెల్లఁ
దెలియఁజెప్పు మటన్న నక్కలికిమిన్న, యింపు దళుకొత్త నతనికి నిట్లు లనియె.

గీ. తండ్రి విను మేను గంగను దక్షహరుఁడు
నన్ను నొకకారణమున డెందంబులోన
నలిగి జాలారికన్నియ వై జనించు
మని శపించిన వచ్చి యిట్లైతి జుమ్ము. 35

గీ. తల్లి యైనను విను మఱిఁ దండ్రి వైన, నీవె కా నింక నన్యుల నే నెఱుంగ
నెవ్విధంబున సాఁకెదో హితముతోడ, ననినముద మంది యతఁ డిట్టు లనుచు బలికె.

గీ. అమ్మ నీ వేమిగోరిన నట్లసేతుఁ, గలవు మాయింట సకలభాగ్యంబు లిపుడు
రమ్ము నాతోడ మాభవనమ్మునకును, జీవనప్రాయముగఁ జూతుఁ దెలియు నిన్ను. 37

క. రావమ్మ భువనపావని, రావే నాముద్దుబిడ్డ రావె లతాంగీ
రావే శుభఫలదాయిని, రావే జగదంబ యిపుడె రా నాతోడన్. 38

వ. అని యపుత్రకుండు గావునఁ బెన్నిధానంబు గన్నపేదచందంబున దైవంబు నాకిప్పు డిట్టిబాలారత్నంబు నొసంగె నని పొంగి దానిం దోడ్కొని నిజగృహంబున కరిగి తనభార్య యగుచక్రమదేవి కప్పన నొసంగిన నవ్వధూరత్నంబు. 39

ఆ. పెరుఁగు బాలు జున్నుఁ బెల్లంబు నెయ్యి కొబ్బరి యనఁటిపండ్లు పనసపండ్లు
పిండివంట లిక్షుఖండంబు లోరెంబు, ప్రీతి యొసఁగ నొసఁగి పెనుచుచుండె. 40

వ. అట్లు పెనుచుచున్నయెడ. 41

ఉ. అంగదముద్రికావలయహారలలాటిక లెమ్మెనెమ్మెయి
న్రంగులు గుల్కఁ గ్రొందగటునాదెపుఁబావడసొంపు నింప మే

ప్రబలగరుగిల్కుటందియలు బాలిక లంఘ్రుల ఘల్లుఘల్లనన్
గంగ యమునంగులం గలసి కౌతుకలీలలఁ గ్రీడసేయుచున్. 42

సీ. బొమ్మపెండ్లిండ్లు సొంపుగఁ జేసి సజ్జనగూటియా మెత లనుంగులకుఁ బెట్టు
బలితంపుటపరంజిపంజరంబుల నిడి చిలుకబోఁట్లకు మేఁత లెలమి నొసఁగు
నాడెంపు నెలతాలమేడలపై నిల్చి లీలమై తూఁగుటుయ్యాల నూఁగుఁ
బరువంపు నెత్తావివిరిబొండుమల్లెపం జాపుల నిరత్తి ప్రోదిసేయు
గీ. బోటులను గూడి కిన్నెరమీటు నింపు, సాటుకొలుపుచు జిలిబిలిపాట పాడు
హాళి దైవారఁ జెంగల్వకేళికొలుల, నోలలాడుఁ జెలంగి యవ్వాలుగంటి. 43

వ. అట్లు క్రీడింపుచు దినదిన ప్రవర్ధమాన యగుచున్నంత. 44

సీ. నిద్దంపుసోగ కెన్నెరలు వెనలికంటె నెదఁ జిన్నిచన్నులు కుదురుకొత్తెఁ
గనుదోయి నరసిగ్గుకలికిచూపు లెసంగె నూనూఁగునూఁగారు గానవచ్చెఁ
దావిమోవికిఁ గ్రొత్తతలిరుడాలు ఘటిల్లె జిలిబిలిపలుకుల మొలచె దీప్తి
నెమ్మొగంబున వింత నిగనిగ జిగిపాల్చెఁ జిన్నారినగవులు చెంగలించె
గీ. నడలఁ గడలేని మురిపెంబు గడలుకొనియె, మెఱుఁగుచెక్కుల తళతళల్ దుఱఁగలించెఁ
గటిభరం బించుకించుక ఘనతఁ దాల్చెఁ, జెలికి లేజవ్వనము మేన మొలచుటయును.

వ. అట్టి నవయౌవనారంభంబునఁ జీనిచీనాంబరానర్ఘమణివిభూషణసుగంధతాంబూ
లాదికంబులం దేజరిల్లుచుండె నంత. 46

సీ. నిరులకు మన్కియై చిరసుఖాకర మైన కైలాసశైలశృంగంబునందు
మహనీయతపనీయమయసముద్దీప్తనీలాకాంతమాణిక్యసౌధవీథి
నలువయు వెన్నుండు బలరిపుప్రముఖదిక్పతులును సనకాదియతివరులును
నందీశగుహగజాననభృంగిరిటివీరభద్రభైరవముఖప్రమథపతులు
గీ. దవిలి కొలువంగ గిరిరాజతనయఁ గూడి, యనుపమానర్ఘరత్నసింహాసనమున
నక్కజం బగుఠీవి పైకొక్కనాఁడు, హాళిఁ గొలువుండె రాజశేఖార్ధమౌళి. 47

వ. అయ్యవసరంబున. 48

సీ. మినువాక తెలినీరు నినిచినకుండికఁ బసిఁడిచాయలఁ గేరుపల్లజడలు
వెన్నెలనిగ్గుకు వెదచల్లు నెమ్మేను చక్కనిస్ఫటికంపుజపసరంబు
గాలిసోఁకిన మ్రోయుకడిఁదికిన్నెరవీణె యభినవమృదులకృష్ణాజినంబు
దట్టంపుగోపిచందనపుండ్రవల్లికల్ పసమించుకాషాయవసనములును
గీ. గలిగి భవభర్గ చంద్రశేఖర మహేశ, హర మహాదేవ సాంబ శంకర గిరీశ
యనుచు వేడుక నచ్చోటి కరుగుదెంచె, సాంవిద్యావిదుం డైననారదుండు. 49

గీ. అట్లు చనుదెంచి ద్విజసంఘమిపుడు, భక్తి దైవార నమ్మహాత్మునినగరు
సొచ్చి హెచ్చినవేడుక అచ్చుపడఁగఁ, గేలుగవమోడ్చి యద్దేవి ప్రోల నిలిచి. 50

సీ. రాకేందునికాశరమ్యగాత్రమువాని రమణీయఫణిభూషణమువానిఁ
కందర్పశతకోటిసుందరాకృతివాని డమరుత్రిశూలఖడ్గములవాని
సదమలదరహాసరసాననమువాని భసితాంగరాగవిభ్రమమువాని
సింధురాజినసముంచితనిచోళమువానిఁ గరుణాకటాక్షవీక్షణమువానిఁ

గీ. ప్రథితభువనోద్భవోరువైభవమువాని, ఘనతరానందహృదయపంకజమువాని
సకలలోకాధిపతి యైనసాంబశివునిఁ, గనియె మునివరాళి కన్నులకఱవుదీఱ. 51

క. అటువలెఁ బొడఁగని కేల్గవ, నిటలస్థలిఁ జేర్చి సంజనితకౌతుకవి
స్ఫుటదంతరంగుఁ డై య, జ్జటిజనులవల్లభుఁడు వాక్యచాతురి మెఱయన్. 52

సీ. భసితాంగరాగాయ భక్తానురాగాయ ఫాలేక్షణాయ తుభ్యం నమోస్తు
భర్మాద్రిచాపాయ భద్రేంద్రవాహాయ భయవిదూరాయ తుభ్యం నమోస్తు
భండనోద్దండాయ భానుప్రతాపాయ భవ్యరూపాయ తుభ్యం నమోస్తు
భరతప్రవీణాయ భవనాయితనగాయ భద్రప్రదాయ తుభ్యం నమోస్తు

గీ. భావభవసంహరాయ తుభ్యం నమోస్తు, భవసరన్నావికాయ తుభ్యం నమోస్తు
భద్రచర్మాంబరాయ తుభ్యం నమోస్తు, భారతీశార్చితాయ తుభ్యం నమోస్తు. 53

వ. అని నమస్కరించి వెండియు. 54

సీ. జయజయ కైలాసశైలనికేతన జయజయ దేవతాసార్వభౌమ
జయజయ గిరితనూజామనోంబుజభృంగ జయజయ దైవవేశ్యాభుజంగ
జయజయ నిగమాంతసముదయసంవేద్య జయజయ భువనరక్షాధురీణ
జయజయ జలజాతసంభవాండపిచండ జయజయ శాశ్వతైశ్వర్యధుర్య

గీ. జయపురందరహరివిరించనముఖాఖి, లామరస్తోమమకుటాంచలాంచితాబ్జ
రాగమాణిక్యరోచిర్విరాజమాన, చరణపంకేరుహోద్దేశ జయమహేశ. 55

క. పరమేశ నిన్నుఁ బొగడఁగఁ, దరమే శేషునకు హరిపితామహబలసం
హరులకు సనకాదిమునీ, శ్వరులకు నొక్కింతయైన వర్ణింపంగన్. 56

సీ. మహిమ మీఱఁగ సర్వమంత్రరాజం బైనగాయత్రి కీవెపో నాయకుఁడవు
శ్రుతు 'లేకయేవరుద్రోనద్వితీయ' యం చనిశంబు నిన్నె కా వినుతిసేయుఁ
బ్రత్యహంబును 'శివాత్పరతరం నాస్తి' యం చలరస్మృతుల్ నిన్నె తెలుపుచుండుఁ
బురుషోత్తమఖ్యాతిఁ బరఁగువెన్నుఁడు వేయి రాజీవముల నిన్నె పూజసేయు

గీ. జలజగర్భుండు మొదలగుజంతువులకుఁ, బతి వగుటఁజేసి నీకు విశ్రుతము గాఁగఁ
బశుపతిసమాఖ్య చెల్లె నబ్బురము మీఱ, నిన్నుఁ గొనియాడ నెవ్వరు నేర్తు రభవ.

మ. శరికిన్ మర్కటకీటపోతమునకుం గాలాహికిన్ మూలపో
టరికిం జెంచుకొలంపుబత్తునకు వేడ్కన్ మోక్షసామ్రాజ్యసు
స్థిరసౌఖ్యం బొనఁగూర్చి ప్రోచినకృపాసింధుండ వాహాభళీ
సరియే యీహరికబ్జవేల్పుదొర లెంచ న్నీకు శ్రీకంధరా. 58

గీ. శ్వేతుఁడు మృకండుసూనుండుఁ బేరితాఘు
చేతఁ గడలేనియిడుమలఁ జిక్కి పొక్కి
నిన్ను శరణన్న జముఁ బడఁదన్ని వారి
కెన్నటికిఁ జావు లేకుండ నిడితి వభవ. 59

క. హరి తననయనాబ్జముతోఁ, దొరలఁగ నొకవేయివికచతోయజముల నీ
శిరమునఁ బూజించినఁ గని, యిరవుగ నాతనికిఁ జక్ర మిచ్చితివి గదా. 60

క. సురదనుజు లబ్ధిఁ దరువఁగ, గరళము ప్రభవించి జగము గాల్పఁగ దానిన్
సరగున గళమున నిడుకొని, పరిపాలించితివి గద ప్రపంచంబు శివా. 61

గీ. భైరవాకృతియును వీరభద్రమూర్తి, శరభసాళువరూపంబు సరవిఁ దాల్చి
నలినభవదక్ష నారసింహులశిరంబు, లేపుమీఱంగఁ దునుమవె యీశ నీవు. 62

సీ. గడితంపుటపరంజిగట్టు సింగిణివిల్లు గాలిబోనపుఁదిండి కాఁడు నారి
యీరేనుమేనుల నేపుమూపులకొరి యార్మూఁడుతునియలై యలరు వరద
మిరుదుగమొగములదొర తేరుపూన్పతి పగటివేలుపు నేలబండికండ్లు
ప్రాఁబల్కుఁదుటుములు బలవారువంబులు తెరగట్టుమన్నియ తెగలుబంట్లు

గీ. గాఁగ దిగప్రోల్లుబలితంపుఁగడిమిఁ గూల్చి, జగము నావడి యుడిపి నిశ్శంక వెలయు
నీప్రభావంబు బుధులు వర్ణింపఁ గలరె, భానుశతకోటిసంకాశ పార్వతీశ. 63

సీ. పులికరాసంబును బూదిగంధంబును బుజఁగకంచంబును బునుకపేర్లు
చిలువఱాసొమ్ములు చికిలిముమ్మొనవాలు కంకటికోడలేజింకకూన
పలుకుటందియలు చౌవంచన్నెమొగములు మెట్టబిడారంబు వెట్టకన్ను
చేతికత్తుక యాలపోతుపెక్కెంబును గ్రొన్నెలతలపువ్వు విన్నుదురము

గీ. గలిగి వెలుఁగొందునీమూర్తిఁ దలఁపువందు, నిలిపి యేప్రొద్దుఁ గొలుతు నన్నెలమిఁ బ్రోవు
శత్రుబలభీమ దేవతాసార్వభౌమ, గిరిసుతానాథ నిఖిలనిర్జరసనాథ. 64

గీ. వేయినోళ్లను మఱి రెండువేలనాల్క, లలు గలుగు శేషునకునైన నలుమొగముల
ప్రోడకైనను దరమె నిన్నొగడ నింక, వేయునేటికి నన్నుఁ బ్రోవు విశ్వజనక. 65

గీ. అని నుతించుమునీంద్రుఁ గన్గొని శివుండు
సారకరుణామృతార్ద్రనిస్స్వాంతుఁ డగుచు
సుచిరపీఠాంతరమునఁ గూర్చుండఁజేసి
కుశల మడిగి యతిమధురోక్తు లుపచించె. 66

క. మునివర సకలజగంబులు, ననివారణముగ జరింతు వచట నచట నీ
కనుఁగొన్న వింత లెల్లను, వినుపింపుము మాకు వేడ్క విస్తరిలంగన్. 67

క. ఏయేజగములఁ జూచితి, వేయే దేశములు గంటి వేయే పురముల్
పోయక పాడఁ గాంచితి విపు, డాయెడలం గలుగువార్త లచ్చుగఁ జెపుమా. 68

గీ. అనిన నారదుం డిట్లను నఖిల సకల, భువనములఁ జూచుకొనుచు నేఁ బోయిపోయి
నవకుతూహలమహితమానసుఁడ నగుచు, భూతలమ్మున నేలూరిపురము గంటి. 69

సీ. బహురత్నవిరచితప్రాసాదములచేత రమణీయమణిగోపురములచేత
నిందిరాకరదివ్యమందిరంబులచేత సుకరకపోతపాలికలచేతఁ
దపనీయమయదేవతాధామములచేతఁ బటువజ్రసోపానపటలిచేత
భక్తశైలోన్నతప్రాకారములచేత దివిజేంద్రనీలవేదికలచేత
గీ. విమలపద్మాకరోద్యానసమితిచేత, గంధగజరాజధేనుసంఘములచేత
ధరణిసురముఖ్యసజ్జనోత్తములచేత, భవ్యగతిఁ బొల్చు నేలూరిపట్టణంబు. 70

చ. అసమశరోపమానసముదంచితవిగ్రహుఁ గంటి నందుఁ గ్రొ
మ్మిసిమిక డానిబంగరపుమించులమించుపిసాళికమ్మ నిరుల్
రసికమనోంబుజంబులకు రాగము గూర్పఁ గొఱంతలేని మే
ల్పస నలరారు నొక్కయెలఁ బ్రాయపుజాలరికన్యకామణిన్. 71

ఉ. అన్నులమిన్నలం ద్రిభువనాంచితరూపవిలాసమాన్యలం
గన్నులఁ గంటిఁ [illegible]ాని శశిఖండనమండన యెందు నేని న
క్కన్నియవంటి సోయగపుఁగల్కిఁ గనుంగొన నే నెఱుంగ నో
యన్న గణింప శక్యమె మహాహికి దానికడిందియందముల్. 72

ఉ. కొమ్మలు సాటిరావు మరునికొమ్మకరంబునఁ గ్రాలుజాళువా
బొమ్మకుఁ గమ్మవింటి నెఱపోటరి క్రొవ్విరితోఁటలోని దా
నిమ్మకు నిమ్మల వ్వలచునిద్దపుసంపెఁగపూవుకొమ్మ కం
దమ్ముల కెల్ల నిక్కడ యనం దగు జాలరిముద్దుగుమ్మకున్. 73

చ. కులుకుమిటారిగబ్బిచనుగుబ్బలసౌరు జగాని గారవుం
దొలుకరికార్మొయిలుంగుల నెదుర్కొను కొప్పుమిటారునిద్దపుం

గలికిపిసాళివాలు తెలిగన్నులతీరు గణింప మాయురే
యళి కలకంఠకంఠి కలరాయనొయారులు దానికుద్దియే. 74

సీ. చిన్నారిజాబిల్లికన్నె గేదఁగిపువ్వు వెన్నెలతెలినిగ్గువన్నెలగని
తళుకుపుత్తడిబొమ్మ తొలుకరిక్రొమ్మించుతలిరుజొంపపుమావిపలుకుచిల్క
చక్కెరలప్పగొజ్జఁగినీటిపెనువాఁక కపురంపుబరిణె చెంగలువకొలను
వలపులదీవి జవాదినించినబావి కమ్మకస్తురిక్రోవి నిమ్మపండు
గీ. చిలిలినిద్దంపుటద్దంబు పికిలిబెండు, ముగువతలమిన్న వెలలేనిమానికంబు
జాఁగ వలరాయ నయ్యాలనాగబాగు, దెలుప శక్యంబె యేలాటిపలఁతికైన. 75

సీ. సతిమోమునకు నోడి గందమామ కృశించి వెలవెలనై బైట వ్రేఁగుచుండెఁ
జెలిక్రొమ్మడికి నోడి తొలుకరిమబ్బులు నిలువెల్ల విషమూని మలలమట్టె
నువిదపాలిండ్లకు నోడి బంగరుగిండ్లు కాఁకచే నుడుకుచుఁ గలఁగఁబాఱెఁ
జేడికన్దోయికి నోడి జేడిసమీలు మిట్టిపాటున నేట బిట్టుపడియెఁ
గీ. దరుణినును జెక్కులకు నోడి దర్పణములు
మైల వాటిలఁ గొంతఁ గన్నాసి యుండె
నేమిచెప్పుదు నఖిలలోకేశ నీకు
దానిసౌందర్య మెన్న నాతరము గాదు. 76

సీ. అళిజాలవేణి శైవలరోమవల్లరి సారసవదన కల్హారపాణి
కలహంసగామిని కచ్ఛపచరణాగ్ర మకరజంఘాలత శకులనయన
కలభోరుకాండ కోకపయోధరద్వయ సైకతజఘన కింజల్కరదన
కంబుకంధర వీచికావళియావర్తనాభికా విసరమృణాలబాహ
గీ. యగుచు భువనాభిరామవిఖ్యాతి నెపుడు, వెలయుచున్నట్టి యాఘనవేణితోడ
గరుడగంధర్వయక్షకిన్నరనిలింప, భుజగగజగామినులు సాటి పోలఁ గలరె. 77

క. పాదవుఁగ నెగని తళుకన్నెని, పాదచూపి యదృశ్య మగుచుఁ బోవు మెఱుంగుల్
పడఁతుకనెమ్మియిజిగి కెన, యిడఁగాఁ బోలవుగదయ్య యిందువతంసా. 78

సీ. ఇది కీలుజడ గాదు చదువుపల్కులమావజీరుని వాఁడికటారు గాని
యిది నెమ్మొగము గాదు కొదమతుమ్మెదనారివిలుకాని యద్దంపుఁబలక గాని
యివి కటాక్షము లౌను చివురాకుబాకుసాధను గానితూఁపుమొత్తములు గాని
యివి కుచంబులు గావు పూజిరానెఱజోదు మేలిబంగరు బొంగరాలు గాని
గీ. యిది వలపుకెంబెదవి గాదు మదనభూప
కరవిరాజితపద్మరాగంబు గాని
యనుచు రసికాగ్రణులు దనయవయవములఁ
బొగడ నెగడొందు నార యాచిగురుఁబోఁడి. 79

సీ. కలికివాల్గన్నులఁ దిలకించి చూచిన వెడవింటిదొరబాణవృష్టి గురియుఁ
గులుకుచు జలిబిలి తెలినవ్వు నవ్వినఁ గమ్మగ ప్రపుదుమారమ్ము గ్రమ్ముఁ
దొరతొరవెలయుముద్దులమాట లాడిన సొంపార విరితేనెసోన చిలుకుఁ
బుడమిఁ జక్కఁగఁ జూచి యడుగిడి నడిచినఁ బలితంపుఁగెంపురంగులు వెలుంగు
గీ. కచకుచకటిభరంబుచేఁ గొను వడఁక, నూత్నచామీకరామూల్యరత్నఘటిత
కాంచికాఘటికాఘణంఘణలు సెలఁగ, దాసకులవారి మురునిద్దపుఁగటారి.

ఉ. ముద్దులకేమి నాపలుకు మూనశరాంతకచిత్తగింపు మ
మ్ముద్దియతళ్కుచూపతను మోహనశాతశిలీముఖంబులో
నుద్దడుకంగఁ బోయి మది నూహ యొనర్పఁగ నట్లు గానిచో
నద్దర యెల్లవారిహృదయంబులఁ గాఁడి చనంగ నేర్చునే. 81

ఉ. అలతకూన యాలలన యాలవలీదళకోమలాంగి యా
లోలకురంగశాబకసులోచన యామదచంచరీకని
లాలక యాసమగ్రతుహినాంశుమనోజ్ఞముఖారవింద యా
చిలకచాశిరోగ్రమణి నీకుఁ దగుం జెలిమాట లేటికిన్. 82

గీ. గంగ యనుపేరు దన కొసఁగంగ భువన, మంగళాకృతిఁ బొల్చునయ్యంగనాల
లామఁ గనుఁగొంటివేని యోస్వామి నీకు, నిరుపమానందసంసిద్ధి దొరకుఁ జుమ్ము.

గీ. అని మునీంద్రుఁ డెఱింగింప నభవుఁ డపుడె, కొలువు చాలించి యెల్లవారలను బోవఁ
బనిచి తనతోడ రాఁ గోరుపర్వతాధి, రాజపుత్రిక నంతఃపురమున నిల్పి. 84

సీ. జడలు చిక్కులువాపి నడునెత్తి నిగవైచి తావిసంపెఁగపూలదండఁ జుట్టి
నిటలభాగమున నున్నోలిబూదిరేఖయుఁ బాపకస్తురిచుక్కబొట్టు వెట్టి
వలువబంగరుశాలువ లెవాటు గావించి మొలఁ బట్టుదట్టియమ్ముల బిగించి
నులిచిగాటెంపుమీసలు చక్క సవరించి బవిరిగడ్డము దీరుపడఁగ దువ్వి
గీ. కేలఁ జారుకపాలంబు గీలుకొలిపి, మేన నవగంధసారంబు మెదిచి పూసి
గిలుకుపావలఁ దొడిగి యగ్గిరిశుఁ డప్పు, డతిమనోహరజంగమాకృతి ధరించె. 85

వ. అట్లు జగన్మోహనోదారజంగమాకారంబు ధరించి చనుదెంచి యేలూరి
మహానగరంబుఁ బ్రవేశించి తదంతికప్రదేశంబున నొక్కచోట. 86

మ. కనియె న్నీలగళుండు బిల్వబదరీఖర్జూరజంబీరచం
దనమందారలవంగచూతలవలీనారంగభల్లాతకీ
పనసాశ్వత్థకపిత్థతాలవటరంభానారికేళాదికా
వనిజాతానిళభాసమానము సరోవాపీవృతోద్యానమున్. 87

సీ. కలకంఠకులకంఠకాకలీధ్వానము ల్చెలఁగి దిక్వలయంబు చెవుడు పఱుప
శుకశారికాకదంబకమృదుస్వనములు జనుల కామోదంబు సంఘటింపఁ

ప్రమదనృత్యన్మత్తబర్హిణారావంబు లవిరతశ్రుతిపుటోత్సవ మొనర్ప
నవనవమకరందనందితేందిందిరగానము ల్చిరసుఖాకరము గాఁగ

గీ. ఘనమరాళారవంబుల్లు గ్రమ్ముకొనఁగ, బంధురసుగంధగంధిలగంధవాహ
శాబకము లోలి నధ్వక్రమము దీర్ప, నతిమనోహరగతిఁ బొల్చె నవ్వనంబు. 88

వ. అందు. 89

సీ. తావులీనెడుగుజ్జుమావిమ్రాకులచెంతఁ బెనఁగొన్నగున్నసంపెఁగలపజ్జఁ
గపురంపుటనఁటిమోఁకలకంటి ప్రాఁకిన పరువంపుద్రాక్షపందిరుల క్రింద
గముగమవలచుచొక్కంపుగొజ్జఁగినీట నేటఁజక్కరకడ నిరువుకొన్న
బలితంపుఁజెంగల్వబావులకేళివులఁ బన్నినచలువచప్పరమునీడ

గీ. నందముగఁ బొల్చునిద్దంపుఁజందమామ, యాలఁ గట్టినజాళువామేలితిన్నె
మీఁద మోదంబు దళుకొత్త మిన్కుటంపు, రీవిఁ గూర్చుండె జంగమదేవుఁ డపుడు.

వ. అయ్యవసరంబున. 91

సీ. కురులుచిక్కులు విప్పి కొప్పు నిప్పుగ దిద్ది యసదుకస్తురిబొట్టు నొసలఁ బెట్టి
వలిపెచెంగావిపావడ చక్క సవరించి కలుకుబంగరుచేలఁ గటి ఘటించి
చిలుఁగుపైఁటాణికంచెల గుబ్బలు బిగించి గడితంపువలిగమ్మగలప మలఁది
కలికికన్నులమించుకజ్జలంబు ధరించి యలరుసంపెఁగదండ లరుత నించి

గీ. హారకేయూరకటకమంజీరకాంచి, కాంగుళీయకకర్ణపత్రాదివివిధ
మణివిభూషణనిర్మలఘృణులు వెలుఁగ, గంగశృంగారలీలావృతాంగి యగుచు.

గీ. నెచ్చెలులఁ గూడి వేడుక లచ్చుపడఁగ, నొచ్చె మొదవనిహాళిమైఁ బెచ్చుపెరిఁగి
పచ్చవిల్కానిమేటిరా లచ్చి యనఁగ, వచ్చి చెచ్చెర శృంగారవనము సొచ్చి. 93

క. చొచ్చి ఝుణంఝుణునినదస, ముచ్చయురంభాసమానమోహనకటకో
ద్యచ్చరణసరసిరుహ యై, విచ్చలవిడిఁ బూలుఁగోసె వెలఁదులు దానున్. 94

చ. చిలుకలఁ దోలి కోయిలలఁ జిందరవందరగాఁగ నేలికే
కుల బెదరించి తుమ్మెదల గుప్పునఁ బాఱ నడంచి యంచలం
గొలకులఁ బాసి జక్కవలకు న్నలరాయిలుచూపి పూఁబొదల్
వలఁగొని దూఱి కప్పురపువంతుల దాఁటి విహారలీలలన్. 95

గీ. కప్పురము రేఁచి లతికానికాయ మూఁచి, పాదపము లెక్కి తియ్యనిపండ్లు మెక్కి
సరసగతి డాసి తావిక్రొవ్విరులు గోసి, చెలులు పుష్పాపచయకేళి సలిపి రోలి. 96

సీ. కనకాంగి నీనాసికకు జోక యగువీఁకఁ గనుపట్టుచున్నవి గంధఫలులు
శుకవాణి నీవాతెఱకు సాటి యగుపాటిఁ దనరారుచున్నవి దాసనములు
ముకురాస్య నీగుబ్బలకు నుద్ది యగుబుద్ధి నింపూనుచున్నవి యీడెపండ్లు
కలకంఠి నీనాభికకు సరి యగుమురిఁ బొలుపొందుచున్నవి పొన్నపూలు

గీ. ముగుద నిదంతములకెన యగుపొగరున్న మురుపుఁ జూపుచు నున్నవి మొల్లమొగ్గ
లనుచు నన్యోన్యసరసోక్తు లాడుకొనుచు, ననలు గోసిరి సరసిజాననలు మొనసి.

ఉ. అప్పుడు జంగమేశ్వరుఁ డొయారము దద్దయు మీఱ వేడ్కతో
గుప్పున లేచి పాదములగుత్తపుఁజావలు మెట్టి లీల న
య్యొప్పులకుప్ప లున్నయెడ కుబ్బు లరారఁగఁ జేరి కోరికల్
చొప్పడ మ్రోల నిల్చి మదిఁ జొక్కుచు నబ్బురపాటు వాటిలన్. 98

సీ. చిన్నారిమోమునఁ జిలుగుచెమ్మటఁ గ్రమ్మఁ గొనబొఱుపువ్వులఁ గోయుదాని
గడితంపు లేయెండఁ గ్రాఁగిన నెమ్మెయిడల నందంద నిలుచుదానిఁ
దాటిపూఁబొదరిండ్ల దూఱుచో నడలిన క్రొమ్ముడి సవరించుకొనెడిదాని
గుత్తంపువలిగబ్బిగుబ్బచన్నులమీఁద నలుకొన్న సరు లిమ్ముకొలుపుదాని
గీ. నిటుమీఱంగ జిలిబిలిపాటఁ బాడి, బోటులకు సంతసం బెదఁ బూచుదాని
వన్నియలకొల్ల మిన్నలై యున్నదానిఁ, జిన్నిప్రాయంపుజాలరికన్నెఁ గనిరి.

చ. కని యెనలేనికూర్మి మదిఁ గ్రమ్మఁగ నమ్మగమిన్నమిన్న కా
మన నిజరాజ్యలక్ష్మి యగుమానినిడగ్గఱఁ జేరి కోరికల్
బెనఁగొన నార యీకులుకుబిత్తరిగుత్తపునిండుగౌఁగిటం
దనివిసనన్ సుఖింపక నితాంతలతాంతశరార్తి యారునే. 100

క. అన్నుల నెందఱి నేనియుఁ, గన్నులఁ జూచితిమిగాని గరుడాహిమరు
త్కిన్నరనరభామలలో, కన్నెలతలమిన్నఁ బోలఁ గలరే యెన్నన్. 101

గీ. సకియనెమ్మోము పున్నమచందమామ, కలికికన్నులు వాలుగగండుమీలు
పొలఁతిచనుగుబ్బ లపరంజిబొంగరాలు, తరుణిచెక్కులు మృదునవదర్పణములు.

గీ. కలికి పదియాఱువన్నెబంగరుసలాక, గావలయు నద్దిరా యట్లు గాకయున్న
నఖిలసంగపరిత్యాగు లైనయతుల, డెందములకైన నాస పుట్టింపఁ గలదె. 103

చ. పగడము బంధుజీవకముఁ బంకజరాగము దాసనంబు లేఁ
జిగురును బింబికాఫలముఁ జెందిరమున్ దిరమొప్ప నిప్పడే
ముగుదులమిన్నతియ్యనుమోవికి సాటి యటంచు నెంచఁగాఁ
దగదుగదా తగం దగవుదప్పి వచించుట దోసమే కదా. 104

చ. మొలకమిటారిగుబ్బలును ముద్దులుగారు మెఱుంగుచెక్కులుం
దళుకుపిసాళిచూపులును దమ్మివిరి న్నిరసించుమోము క్రొం
దొలుకరిమబ్బులం దెగడుదోరపుఁగొప్పును గల్గి యొప్పు ని
క్కలికియలంతిజవ్వనము గన్నులపండువ యయ్యె నద్దిరా. 105

సీ. గజనిమ్మపండులఁ గజిబిజి యొనరించి మాలూరఫలములఁ గేలిసేసి
తమ్మిమొగ్గలచోఁ గాటమ్ముల సడలించి క్రొన్ననబంతులఁ జిన్నఁబుచ్చి
కరికుంభములఁ దిరస్కారంబు గావించి యుపరంజిగింజుల నపహసించి
పొన్నకాయలసొంపు సన్నగిల్లఁగఁ జేసి జక్కవకవ నెకసక్కె మాడి
గీ. మెలిరతనంపుబలుబొంగరాలఁ దెగడి, కనకధాత్రీధరేంద్రశృంగములఁ గేరి
లీల నలరారు నార మే లీలతాంగి, కులుకుసిబ్బెపువలిగబ్బిగుబ్బదోయి. 106

గీ. బాలికామణి పెన్నెరుల్ బారెఁ జేసి, చేడియలమిన్నకన్నులు చెరఁ జేసి
కలికివలిగబ్బిగుబ్బలు గాసెఁ జేసి, చేసి నడుమేల మాయంబు సేసె నజుఁడు. 107

చ. నిబుకడఁగన్నకౌను ఱెంగునిద్దపుఁబల్కులు నేర్చుకొన్న క్రొం
దళుకుపసిండిబొమ్మ తెలితావులు గాంచినమానికంబు చే
ష్టలు గల గుజ్జుమావి దిగఁజాఱిననిర్మలచంద్రరేఖ యీ
యలికులవేణి సోయగ మయారె యొయారుల నెందుఁ జెందునే. 108

ఉ. అద్దిర నాకు దీని నెన రబ్బినఁ గొబ్బున గుబ్బదోయిఁ జే
కొద్దిఁగఁ బట్టి కౌఁగిటను గూర్చి నిగారపుమోవి సారెకు
న్నద్దులు గొంచు మన్మథవినోదముల న్విహరింతుఁ గాని చో
నెద్దియు నాకు నంబున కొంకించుక కోర్కెఁ దీర్ప నేర్చునే. 109

క. అని పలుకుచు మెల్లన యా, వనితామణిఁ జేర నరిగి వలపులు నిగుడన్
మనసిజుఁడు దసంహోక్షుఁడై, ట్టనియెన్ మృదువచనరచన లలరారంగన్. 110

క. ఎవ్వతవు నీవు దవ్వుల, బువ్వులఁ గోయంగవచ్చి పొలుపారెదు తే
జవ్వనపుమేను గందఁగ, నివ్వనవీథిం జరింప నేమిటి కబలా. 111

క. కాముని బూజ యొనర్పనో, హైమవతీరమణునకు సమర్పణ యిడనో
గోముగఁ బాన్పలరింపనో, యేమిటి కీపూలు గోసె దిభరాడ్గమనా. 112

క. కొమ్మలను గూడి క్రొవ్విరి, కొమ్మలపై నిమ్ముమీఱఁ గూరిమి మరునా
యమ్ముల నెమ్మదిఁ ద్రిమ్మకు, తుమ్మెదలఁ గలంచెదిట్లు దోసము గాదే. 113

క. చెంగల్వలు వలెనో గొజ్జెంగులు గావలెనో మంచిచేమంతులు సం
పెంగలు వలెనో తెచ్చెద, శృంగారవతీలలామ చెపుమా నాకున్. 114

క. కొమ్మా కొమ్మా యిదె విరి, కొమ్మ కరమ్ములని సొలసి కోసితి వీకై
రమ్మా పూఁబొదరిండ్లకు, నిమ్మారఁగ ముత్తియము గోసి యిచ్చెద నచటన్. 115

క. జిలిబిలి చెమ్మట మోమున, నలుముకొనం బొదలవింట నలసెద వేలా
వెలిపూసురటి న్విసరెద, నిలుమా యొక్కింతసేపు నీరజవదనా. 116

క. నను లాఁతివానిగా నె, మ్మనమునఁ దలఁపంగఁ జనదు మానిని వేడ్కన్

మనుగప్పురంపువిడె మిడి, గొనుమా యనుమాన మడిగి కువలయనయనా. 117

వ. అనిన నేమియు మాటాడక గంగ యూరకుండినఁ దత్సఖీజనంబు లజ్జంగమ
య్యం గనుంగొని యిట్లనిరి. 118

క. ఎవ్వఁడవు రోరి నీ విపు, డివ్విధమున నాము మీఱి యేకతమ వనిం
బువ్వులఁ గోయుచు మెలఁగెదు, జవ్వనులం జెనకి పొదువఁ జాగితివి భళీ. 119

క. ఏరా గారా మారఁగ, నారాటం బెత్తి హత్తి యబలలఁ జెనకన్
మేరా తీరా యూరక, పోరా పోకాము లుడిగి పొమ్మిటు కైనన్. 120

వ. అనిన వారివచనంబులు సరకుఁగొనక వెండియు జంగమేశ్వరుండు గంగం
గనుంగొని. 121

గీ. పువ్వుబంతు లొసంగవే పువ్వుఁబోఁడి, చిగురుటాకైన నీగదే చిగురుఁబోఁడి
దండఁ గూరిచి యిడుము వేదండయాన, యనుచు మెల్లనె నర్మోక్తు లాడుకొనుచు.

సీ. కిన్నెర మీటి కన్గీటి సన్నలు సేయుఁ బకపక నగి యేలపదముఁ బాడుఁ
గెంగేలలాంతంబు గిరగిరఁ ద్రిప్పు లోఁ జొక్కుచు వెడవెడ మెక్కు మెక్కు
లింగ లింగ యటంచుఁ జెంగున దాఁటు మీసలు గీటు గడ్డంబుఁ జక్కఁదువ్వుఁ
గులుకుచు జిలిబిలిపలుకులఁ జెప్పు గామిడి యయి పైఁటకొంగు గొడిసి తిగుచుఁ

గీ. దివిరి బలిమాలి దిక్కులు దిరిగి చూచు, నవలి కరుగుచోఁ ద్రోవ కడ్డపడి నిలుచు
వలపు మీఱంగఁ జెలిమురుల్ గొలుపుకొనుచుఁ, గోడెప్రాయంపుజంగమకులవిభుండు.

క. క్రొమ్మావికొమ్మచివు రదె, కొమ్మా కెంగేల నందుకొమ్మా యని హిం
లమ్మాడుఁ జిలుగుపయ్యెదఁ, గ్రమ్మినవలిగుబ్బదోయిఁ గనుఁగొను వేడ్కన్. 124

వ. ఇత్తెఱంగున హొరంగునం జెలంగి మెలంగుజంగమపుంగవుం గనుంగొని యంగనా
మణు లిట్లనిరి. 125

క. మున్నెప్పుడుఁ గొమ్మలతో, నెన్నిక గాఁ దిరిగినాఁడ వేమి బళా మేల్
కన్నెలవెంబడిఁ బడి కడు, మున్నటికెల మెలఁగె దిట్లు మోసంబు గదా. 126

క. కొంచక మున్నెందఱి భ్రమ, యించితివి గదా చెలంగి యీ వేసమునన్
మంచిది పిదత్తురము లొ్యకించుక మాయొడల సాగ వే లామాటల్. 127

సీ. కరతాళగతు లెసంగఁగఁ దందనాల్యాడి చొక్కుచుఁ జిందులు ద్రొక్కెదేమి
కిలకిల నగుచుఁ గన్గీట సన్నలు సేసి వలిపువ్వుఁబోఁడులఁ బిలిచెదేమి
గరువంపుఁజిన్నరాగము దీసి యబ్బురపాటుగాఁ గిన్నెర మీటెదేమి
చెలరేఁగి గురవప్ప శివ యంచు నటువలె వెడవెడ గఁతుల వేసెదేమి

గీ. కడిఁదియొయ్యారమే పార నడరి మంచి, విరులబంతులఁ దెమ్మని వేఁడెదేమి
జోగు లెచ్చట యిల్లాలిజోటు లెచట, కొనిబుద్ధులు మాని వేగంబె చనుము.

క. ఆనవిని జంగము లేఁ డా, వనబోఁడుల నీసడించి వగచుం గన్యా
జనచూడారత్నంబుం, గనుఁగొని వెండియును నేర్పు గదురఁగఁ బలికెన్. 129

ఉ. అంగన నిన్నుఁ గంటి నెఱియం గనుపండువుగాఁగ నేఁడు నీ
బంగరుబొంగరాల కెనవచ్చుమిటారపుగబ్బిగుబ్బ లా
ప్యాంగఁగఁ గౌఁగిలించి వలపుల్ దలకొత్త సుఖింపఁ జేయవే
జంగమవారిపాపఁడ భుజంగకలాపమనోజ్ఞభూషుఁడన్. 180

క. వెండియుఁ బైఁడియు నారయుడఁ, గొండలవలె నుండు నెందుకొని యెప్పుడు నో
యంచజగామిని చూడ న, ఖండమహోన్నతవిభూతిఁ గలవాఁడఁ జుమీ. 181

గీ. ఎంతకన్నను నిడుద న్నాలుఁగకుండ, గరిమ నుండుదుఁ దలపువ్వు గందకుండ
నెలఁత నన్నేలు చిరసుఖాన్వితునిజేసి, నిన్ను నేప్రొద్దుఁ దలమీఁద నిలుపుకొందు.

గీ. అంబుజాక్షి కుబేరునియంతవాఁడు
బలియుఁ డొక్కఁడు చెలికాఁడు గలఁడు నాకు
మఱియుఁ దఱలనిసిరి గలనెఱ యనుంగు
గలఁడు గద నాకు బ్రహ్మను గన్నవాఁడు. 183

క. మేనెల్లఁ దెల్లఁబాఱెను, గానంబడ దిప్డు డొక్క కన్నులకంబుల్
జానరవిజడలుకంటెను, జానరొ నినుఁ గోరి పైదొసంగులు వడుటన్. 184

గీ. అన్న మెన్నడు నెఱుఁగ నీయానఁ గన్న, దెలవ వెఱతును మంటచేఁదెఱలుచుండు
మేను సగ మయ్యెఁ గుత్తుకలోనిచేఁదు, వదల దలివేణి నీమీఁదివలపుకతన. 185

క. పులికిని భూతంబునకున్, బలితపుమత్తేభమునకుఁ బాముకు నెదలోఁ
దలఁకక తిరిగెద నెప్పుడుఁ, బొలఁతి నీమీఁదివలపు పోరిఁబోరిఁ బెరయన్. 186

శా. రావే మత్తచకోర చారునయనా రావే జగన్మోహినీ
రావే రాజమరాళరాజగమనా రావే లతాంగీమణీ
రావే పూర్ణసుధామయూఖవదనా రావే మిళిందాలకా
నావెంటన్ అతికౌగృహంబునకుఁ గందర్పాహవక్రీడకున్. 187

క. దూరుని నేమాను గెలిచితి, వైరమ్ము దీర్పంగఁ బూని వాఁడిపు డెదిరెన్
హా రమణీరతిరమణుని, మారవుణీ నన్ను రతుల నలరింపఁగదే. 188

సీ. తామ్మకొమ్మనిశమ్మకమ్మావిపావకం బెమ్మెలోఁ గ్రాలంగ నియ్యరాదె
తళతళల్ దులకించు తెలుసువాల్గన్నుల సొంపార మోమెత్తి చూడరాదె
నిక్కుచక్కనిగుబ్బ లక్కునఁ గదియించి బిగియారఁ గౌఁగిటఁ బెనచరాదె
ఘనజఘనస్థలఘటితనీవీబంధ మెడలించి మరుకేళి నెనయరాదె

గీ. చిల్కచిల్కనఁ జేసియుత్తో చిలుకఁ బలికి
పలుకఁగారాదె సిగ్గు నిప్పచ్చరముగఁ
జెలులటుమ్రొక్కఁ దలఁపున నిలుపఁబోక
మానినీమణి తమిఁ దీర్చి మనుపు మిత్రుడు. 139

క. అగ్గలపువలపు సొలపుల, బగ్గలి నిను వేఁడుకొనెడఁ బ్రియమారఁగ నీ
బిగ్గఁ గవుంగిటఁ గూర్పవె, సిగ్గెల్లను వీడనాడి చిగురుంబోఁడీ. 140

క. నన్నన్నుఁగా నెన్నక, సన్నకసన్నగను గోర్కె సమకూర్పవె నీ
కన్నెఱికపుమున్నెఱికపు, మున్నెఱికలు చూపనేల ముద్దులబాలా. 141

వ. అని యనేకప్రకారంబులఁ బ్రార్థించిన నమ్మించుఁబోఁడి యించుక తల వంచి
యూరకున్న సంగడికత్తియ లజ్జంగమేశ్వరున కిట్లనిరి. 142

క. జంగమదేవర వని యొక, భంగిం దాగితిమి గాక బాపురె నిన్నున్
భంగించి పొఱఁ దఱుమమె, లొంగక మతియుక్కరైన లోకం బెఱుఁగున్. 143

క. అఱమఱ లేటికి మాతో, మతిమతిఁ గొఱగాని వెడఁగుమాటలు పలుకన్
వెఱవవు మంచిదె మాచే, నెఱిఁగెదుగద యింక నిపు డహీనగుణాంకా. 144

చ. సరిసరి మంచిజాణవె విచారమిఁ కేటికి నన్యకామినీ
సురతవిహారలంపటతఁ జొక్కుచు మేలము లాడవచ్చె నీ
కరణి మెలంగుచుండుటకుఁ గాదనువారలు లేరు ధాత్రిపై
హరిహరి యింతదుండగపుటాటలఁ గంటిమె యెందు నేనియున్. 145

క. తిరునుకదిను నీ వెంతర, కర మరుదుగ నెదుటఁ గన్నుగలవాఁ డైనం
దరలి చనగలఁడె మాతో, విరసించి యహహా కడిందివింతలు పుట్టెన్. 146

క. కావరమున మాచెలిపై, నీవిధమునఁ గన్నువేసి యేలవించెద వో
మావారు విన్న జంగమ, దేవర ననుకొన్న నీకుఁ దిప్పలు రావే. 147

వ. అనిన నజ్జోగిరాయండు వారల కిట్లనియె. 148

మ. పలుచందంబుల వేఁడుకొన్న నకటా బాలామణిం గూర్పకే
చల మారం గలఁగిం(హి)పఁ జూచితిరి వాచాలత్వము ల్మీఱ నె
చ్చెలు లిట్లుండఁగ మీరు గల్గుటకు రాజీవాననుం గంతువా
లలరుందూపులపాలఁ బోనిడెద రాహా యెంతగయ్యాళులే. 149

మ. కలకంఠంబులు శారికల్ శుకములుం గాదంబముల్ భృంగముల్
బలము ల్తోడుగ వెంట నంటి కొలువన్ బాలానిలంబు ల్కొలం
కులఁ జాఁ బంకజవైరి మింట వెలుగం గో యంచుఁ జెల్లార్చి మీ
కలకంఠీమణిపై మరుం డెదురుచోఁ గాపాడఁగా నేర్తురే. 150

వ. అని పలికి వెండియు గంగం గనుంగొని. 151

క. ఉన్నవిధంబున వేఁడిన, సన్నుత నన్నుఁ గనుఁగొని సమకూర్పక హా
మిన్నంది పొంగి పొరలెద, వన్నన్న గణింప బల్గయాళివి గదవే. 152

క. తాఱుచుఁ బూపొదలెల్లను, దూఱుచు బలితంపుఁజెట్లతుది కెక్కి వడిం
జాఱుచుఁ బెద్దఱయానతి, మీఱుచు విహరింప నీకు మేరయె చెప్పుమా. 153

క. పలుమఱుఁ బతిమాలిన లోఁ, గలఁక వహించుకొని లోఁతు గనఁబడని క్రీ
మఱకలఁ బెట్టెదు నీకు, న్నిలువెల్ల విషంబు గదవె నీరజగంధీ. 154

క. విను విను నాపలు కిప్పుడు, వనజాతముఖీలలామ వాలెము నాతోఁ
బెనఁగొనఁగఁ జనిన నవ్వాల, ననిశము భంగములపాల నడలెదవు సుమీ. 155

గీ. అనినఁ జెఱునవ్వు లోలోన నడచుకొనుచు, గంగ తనతన్కు క్రొవ్వాడి కలికి మాపు
అతనుభిరిగల్వతూపులై యతనికాఁడ, నింపు దీపింప మెల్లన నిట్టు లనియె. 156

క. భళిభళి సర్వజ్ఞుఁడవే, పలుకుల కింకేమి లాఁతిపనుచుల వెంటన్
వలఁగొని తిరిగెడునిన్ను, యిలఁ గాదనువారు లేరె యెంతటివారున్. 157

గీ. పరసతీలోలుఁడవు నీవు చాలి మీఱు, నచలసంస్థితి సానుల నంటి తిరుగఁ
జెల్లుగా కిట్టులిల్లాండ్రఁ జేరి మెలఁగఁ, జనునె నీకియ్య మిఁకఁ జాలు చాలు పొమ్ము.

గీ. అని పలుకుచున్నచోఁ జెలి యద్దిరయ్య, జోలెజంగంబు నీ కింతజోలి యేల
నరి భళా షట్పదరయం చరిదిహోయలు, గదురఁ జనుదెంచి రిండ్లకు గంగఁగూడి.

క. అత్తఱి జంగమరాయఁడు, చిత్తము తత్తరముఁ జెందఁ జిడిముడిపడుచున్
బిత్తరిహొయ లెదఁ బెనఁగొన, మెత్తం బాటూని చనియె మెల్లనఁ బురికిన్.

వ. చని యొక్క వివిక్తదేవతాగారంబున నుపవిష్టుండై యుండె నని సవ్యసాచికి గాంగేయుం డెఱింగించిన నతం డతని నవ్వాలికథావిధానం బెట్లని యడుగుటయును.

ఆశ్వాసాంతము.

మ. శరదిందూపమదేహా నిర్జితవిపక్షవ్యూహా కైలాసభూ
ధరశృంగాటకగేహా దీనజనసంత్రాణామితోత్సాహ భా
స్వరగోవల్లభవాహా పర్వతసుతాసంభోగకేళీకళా
నిరతాభ్యంచితమోహా సారబలనిర్నిద్రాగ్రబాహార్గళా. 162

క. కరుణావరుణాలయ గిరి, శరణా శరణాగతార్తజనఘనభయసం
హరణా తరుణాభామృత, కిరణాధరణా సమగ్రకీర్తిస్ఫురణా. 163

మాలిని. పురదనుజవిభంగా భూషితోద్యద్భుజంగా
సురుచిరధవళాంగా సూరిచేతోబ్జభృంగా
కరకలితకురంగా కాంతగంగోత్తమాంగా
తరణిశశిధరాంగా దైవవేశ్యాభుజంగా. 164

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్ష నిరీక్షణ సంలబ్ధ సరసకవితా సామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్త్ర సకలసంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామ తిమ్మకవి సార్వభౌమప్రణీతం బైనశివలీలావిలాసం బనుశృంగారరసప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.



రాజితగుణసంగా
ఘోరాఘతమఃపతంగ కుతలశాంతాంగా
తారేశహీరనారద
హీరాభశుభాంగ కుక్కుటేశ్వరలింగా. 1

వ. అవధరింపుము పాండునృపాలనందనునకు గంగానందనుం డిట్లని చెప్పం దొడంగె
నట్లు శాంబరి జంగమేశ్వరుండు వివిక్తదేవతాగారంబున వసియించి యున్న
సమయంబున. 2

గీ. సకలలోకాధిపతి యైనశంకరుండు, గంగకై బిట్టు వంతలఁ గలఁగుచుండెఁ
బగలు సేయుట తగదని పరచె ననఁగఁ, గమలహితుఁ డస్తశైలశృంగమునఁ జేరె.

గీ. కాలకంఠుఁడు జాలారికన్నె తనకు, నబ్బ వని యుబ్బి తాండవం బాడుచున్నఁ
జెదలఁ బర్విన కెంజాయజడ లనంగ, నంబరస్థలి సాంధ్యరాగంబు మెఱసె. 4

గీ. చిగురువిల్కాఁడు దనతొంటిపగఁ దలంచి
విశ్వరూపంబు దాల్చి కోవెలలు నళులు
గ్రమ్ముకొని కొల్వఁ జంద్రశేఖరునిమీఁదఁ
గడఁగి దండెత్తె ననఁగఁ జీఁకటులు పర్వె. 5

క. సురలపు డంబరకేశుని, శిరమునఁ బూజించుచున్నఁ జెన్నారెడు క్రొం
బరువంపుబొండుమల్లియ, విరు లనఁ దారకలు గగనవీథి న్మెఱసెన్. 6

క. హరునకు గంగకుఁ బెండిలి, సరగున నగు నని నిలింపసతు లారతు లీ
గరములఁ బట్టిన మేల్బంగరుపళ్లెం బనఁగఁ దుహినకరుఁ డుదయించెన్. 7

గీ. భవుఁడు జాలారికన్నెకై బడల నొడలి, విరహపరితాపజనితపాండురమరీచు
లబ్బురంబుగ జగములఁ బ్రబ్బె ననఁగఁ, బండురేయెండ లెల్లెడ నిండుకొనియె.

ఉ. జంగమరాయఁ డయ్యెడల జాలరిలేమ యొయార మాత్మ వే
ధంగుల నెంచి దర్పకుని బారికి బిట్టు చలించి యారసా

రంగవిలోచనామణిపరాకున న న్నికరించి యేగుచో
బంగరుపైఁటకొం గొడిసిపట్టి పెనంగక పోవనిచ్చితిన్.

ఉ. గద్దరిబోటికత్తియలు గ్రమ్మి నయమ్ముగఁ బెక్కులాగులన్
సద్దులు సేయఁగా భ్రమసి జంటఁ బెనంగఁగ నేరనైతి వే
సుద్దులకేమి యీపలువజోటులపంతము దీఱె నేఁడు నా
బుద్ధికి మోస మయ్యెఁ గద బూమెలగీములు వామలోచనల్. 10

చ. మరుఁడు విరోధి చంద్రుఁడును మందసమీరుఁడు నేల నిల్ప రీ
పరభృతశారికానికరబర్హిమరాళశుకీమధువ్రతో
త్కరములు నాకు భూతములు కంజముఖీమణి బల్గయాళి హా
హారిహారి యింక నీసరసిజాంబకబాధల కెట్లు దాళుదున్. 11

ఉ. ఏగతిఁ దాళువాఁడ నిఁక నెవ్వరి నేక్రియ వేఁడువాఁడ న
బ్బా గిరి నింక నెందు సులభంబుగఁ గన్గొనువాఁడ నెట్లు పై
వేఁగినదాకఁ దాకువెడవిల్తునితూపుల నోర్చువాఁడ నా
హా గురులింగ దానిహొయ లాత్మఁ దలంచిన గుండె ఝల్లనున్. 12

ఉ. హా వికచారవిందముఖి హా మదమత్తమరాళగామిని
హా విబుధేంద్రనీలరుచిరాలకజాలక హా విలాసిని
హా వరవర్ణినీజనశిఖాగ్రమణీ రమణీ ననుం గడున్
భావభవప్రసూనశరబాధల కగ్గముసేసి యేగితే. 13

క. చిరసుఖదాయిని యని నిను, నిరవొప్పఁగ వేఁడుకొనిన నిటు భంగములం
బెరయించి లోఁతు చూపక, దరిఁ జేర్పక సుళ్లఁ బెట్టఁ దగునే గంగా. 14

క. నీకరుణామృతధారా, శీకరములఁ బైనఁ జిల్కి చెచ్చెరఁ దాపో
ద్రేకము చల్లార్పం గదె, రాకాహిమధామసమతరంగా గంగా. 15

వ. అని మఱియు విరహావేశంబున. 16

ఉ. ఎక్కడ నల్కదైన జలజేక్షణ వచ్చె నటంచు లేచి న
ల్దిక్కులు చూచి కానియెడ దీనత నుస్సురటంచు నూర్చు నే
చక్కట నిద్ది గన్గొనినఁ జాన శుభాకృతిగాఁ దలంచు హా
చక్కెరబొమ్మ యంచుఁ బలుచందములం బలవించు సారెకున్. 17

ఉ. కన్నులు మూయఁ దుళ్లిపడి గ్రక్కున దిక్కులు రోయు నూరకే
సన్నలు సేయఁ బై పలుకఁ జయ్యన నవ్వులఁ ద్రోయు మింటిపై
వెన్నెలఁగాయుచందురుని వేఁడిమిఁ దాఁ బెడఁబాయు నద్దిరా
చిన్నెలజంగమప్రభుని చిత్తవికారము లెన్నఁ జిత్రముల్. 18

క. అళికీరశారికాపిక, కలహంసమయూరకోకకలరవకురలీ
కలరవముల కులికిపడుం, జలికులయల్లుండు గుండె ఝల్లని లీలన్. 19

వ. మఱియును. 20

క. మదసాదాసకులాంబుజ, వదనామణికొఱకు నేను వందురఁ బోనీ
కదనా యిటులేపఁగ నళి, గద నాచే సైనతొంటికత మఱచితివా. 21

గీ. మొదల నిలమీఁదఁ బడఁదన్ని పిదప బాద
రించి తలనుంచుకొనుటకు మంచిలెక్క
హా గురుద్రోహి వగ చెల్ల నగపడంగ
నన్ను బన్నంబుఁ బొందింపఁ జన్నె చంద్ర. 22

వ. అని బహుప్రకారంబుల మనోవికారంబులం బొరలుచుండె నంత నిక్కడ. 23

గీ. గంగముద్దుగుల్కెడుసాజంగమయ్య, చెలువుమదిఁ నెంచి వలపులు చెంగలించి
యంగభవశాతచూతసాయకపరంప, రావికంపితహృదయరాజీవ యగుచు. 24

చ. కళవళపాటుతో నులకకంకటిపై మెయిఁ జేర్చి తద్దయున్
సొలయుచు హావిమానికపుసొమ్ములు వే సడలించి వైచి యూ
ర్పులు నిగుడించుచుం జెలిమిబోటులకొ బిట్టు సలించుచుం గడున్
వలపులవెచ్చ హెచ్చ మదవారణయాన మదిం జలించుచున్. 25

క. చిలుకలు నంచలు రొదలుచుఁ, బిలిచిన మాటాడ నోడి బెగ్గలుచు మదిం
గలఁగుచుఁ బండుచు లేచుచు, బలవించుచు వగలఁ బొగిలి బాములఁ బడుచున్.

మ. తలయూఁచుం దనలోనఁ దానె నగుఁ జెంతం జేరఁగానీక నె
చ్చెలులం దిట్టుఁ గనుంగవం బడిబడిం జిప్పిల్లుబాష్పాంబువుల్
తెలివారుం గొనగోళ్ల మీటుఁ బొగలున్ దివ్యప్రతాపోజ్వల
జ్జలజాతాంబకశాతచూతవిశిఖస్ఫారానలజ్వాలలన్. 27

వ. ఇట్లు విరాళిం గ్రాలుచుండి మఱియుం దనలోన. 28

ఉ. ఏటికిఁ బుట్టెఁదొంపునకు నేఁగితి నేఁగిన నందు నిటునం
బాటిలుచున్న క్రొందలిరుఁబ్రాఁతపుజంగము నేలఁ గంటి న
ప్పేటి నటుల్గనుంగొని తమిం గవగూడక యేలవచ్చితిన్
బూటకపుంబొలంతుకలు బూమెలఁ బన్ని రిఁకేమిసేయుదున్. 29

వ. అని జంగమేశ్వరుం గురించి యిట్లనియె. 30

గీ. చిగురువిల్కాని గెల్చు సొగసుకాఁడు, లీలమై వచ్చి నన్బతిమాలుకొనిన
వేళనై రోయఁ బొమ్మంటి జాలిమాలి, చెల్లఁబో నింక నే నేమిసేయుదాన. 31

ఉ. అక్కటా గబ్బిగుబ్బగవ నక్కునఁ జేర్చి కవుంగిలించి క్రొం
జక్కెరమోవి పానకము సారెకుఁ జాల నొసంగి వానితోఁ
జక్కెరవింటిమేల్బిరుదుసంగరలీల సుఖింపకున్నచో
గ్రక్కున నాకు నీసుమశరప్రదరానలతాప మారునే. 32

ఉ. కిన్నెర మీటుచు న్వగలఁ గేరి యలంతిగఁ బాటఁ బాడుచున్
సన్నలు సేయుచు న్నగవుచన్నులపైఁ గను వేసి డాయుచున్
సన్నక నన్నుఁ బూఁబోదలచాయకు రమ్మని వేఁడునిహో యల్
గన్నులఁ గట్టినట్టు లగుగద్దరిజంగమరాయసారెకున్. 33

ఉ. ఇందునిభాననామణుల నెందఱి నెందఱి మా న్భ్రమించి శ్రీ
నందనుఁ బాఱఁద్రోచితివి నన్నటుల న్వలయించి నెమ్మదిం
గొందల మందఁజేసి యెటకో చను దెంచితి నీటుటారపుం
జంద మెఱుంగనైతిఁగద జంగమరాయ సతీమనోహరా. 34

క. మారాశుగశుకమధులి, ట్పారావతపికమరాళబర్హిమరుచ్ఛి
హారాంశులసడి కళికెద, రారా నన్ ప్రేమ నేలరా రభసమునన్. 35

గీ. పూలు పన్నీరు గందంబుఁ బోఁక లాకు
అనఁటిపండులుఁ జక్కెర యగరుఁ గప్పు
రంబుఁ గస్తురిఁ గూర్చి యర్చన లొనర్తు
రార వైళంబ జంగమరాయ యిపుడు. 36

వ. అని వగలం బొగులుచున్నమగువం గనుంగొని సఖీశిఖామణులు దమలో నిట్లనిరి.

గీ. కూళజంగంబు వాలారుగోళ్లనిండ, వలపుమందేమొ చల్లి యిక్కలికి నిట్లు
మరులు గొల్పెను గాఁబోలుమాయగాండ్రు, జోగులను నమ్మవచ్చునె సుదతులార.

గీ. ప్రేతభూములఁ దిరుగుచు భూతకోటి, వెంటఁ జనుదేర వెల్మిడి యొంటిఁ బూసి
తోళ్లు బుసకలు నెమ్ములు బెల్లుదాల్చు, జోగులకుమందుమంత్రములు జోలెనుండు.

వ. అని గంగం గష్టంగొని. 40

గీ. ఏమె నీ నెమ్మనాన సిగ్గింతలేక, వానిఁ దిగనాడి పోఁగలేదు గానిఁబడుచుఁ
బెద్ద లెన్నంగఁ దగిననీబుద్ధి విడిచి, చిడిపిజంగంబు దా నేమినీసెనొక్కో. 41

గీ. తల్లిదండ్రులు గుఱము పెద్దలును మఱియుఁ, దగినచుట్టంబులును విన్నఁ దప్పుకాదె
చిన్నదానవు నీ విట్లు సిగ్గుమాలి, పలుదెఱంగుల నోరలంగఁ బాడియగునె. 42

క. కటకట పిడికెడుకూటికిఁ, గొటికెలఁ బడి బికిర మెత్తుకొని మనియెడు న
మ్మటుమాయజంగమునకై, యిటువలెఁ గృశియింపఁదగునె యిందునిభాస్యా. 43

గీ. వద్దు మాయమ్మ యిఁక మంచిబుద్ధిగలిగి, దత్తురప్రజంగమయ్యపైఁ దలఁపు విడిచి
నెమ్మినుండుము శుభములు నివ్వటిల్లఁ, జోగు లెచ్చట నాడెంపుజోటు లెచట.

సీ. కటకట నాఁకటనఁ గష్టి పొందఁగ నేల పసఁబట్టి దోశంబు మెసఁగరాదె
యొడలెల్ల బిగిదప్పి బడలి యుండఁగ నేల యగరుగస్తూరిగంధ మలఁదరాదె
సొగసెల్ల విడిబాలి వగలఁ గుందఁగ నేల వెలలేనిరవణము ల్వెట్టరాదె
తలయెల్ల జడగట్టి మలిన మొందఁగ నేల తీరుగాఁ గ్రొమ్ముడి దిద్దరాదె

గీ. గట్టివలిపట్టుపుట్టము గట్టరాదె, చెలఁగి కప్పురంపుఁదములంబు సేయరాదె
దావిక్రొంబువ్వుసరములఁ దాల్పరాదె, యువిద నీ కిది యేలాటియోజ చెపుమ.

చ. చిలుకలఁ గొట్టిదేమి పరిఁ జేసినబోటులఁ దిట్టిదేమి పె
న్వలపులఁ బొక్కెదేమి తలవంచి మదిం గదుఁ జొక్కెదేమి యా
ర్వుల నిగుడించెదేమి కనుబొమ్మలసారె ముడించెదేమి హా
చిలుకలకొల్కి నీ వెడఁగుచిన్నెలు లిన్నియుఁ జెప్పఁ జిత్రముల్. 46

వ. అనిన వారల కాకన్యాకామణి యిట్లనియె. 47

క. చెలులార యింతనగ్గలు, పలుకంగా నేల యొక్క కోమటుని కనయా
చెలువము గలయవ్వలఁ దెలిసి, వలనీతి మీతోడ నింక వాదము లేలా. 48

గీ. వినుఁడు నామాట మీరెల్ల వీను లలర, నలినముఖులార నా ప్రాణనాథుఁ డైన
జంగమస్వామిఁ దెచ్చి యొసంగరాని, మదనశిఖార్తి మరలించి మనుపరమ్మ.

ఉ. బంగరుపట్టుపుట్టములు భాసురరత్నవిభూషణంబు లు
ప్పొంగఁగ మీకు నిచ్చి పరిపూర్ణకృపామతి నాదరింతు నా
లింగముతోడు నాపలుకు లెస్సగ నమ్ముఁడు బోటులార యా
జంగమరాజశేఖరుని జయ్యన నిచ్చటఁ దెచ్చి నిల్పుఁడీ. 50

క. ఇవ్విధము గాకయుండిన, నవ్వల నవ్వలఁ జెనంచి యంతటిలోనన్
నవ్వులఁ బెట్టక యూరకె, పువ్వారంబోఁడులార పొం డిరవులకున్. 51

మ. కులమెల్ల న్నిరసించి గేలి యిడ నిక్కోపంబు దీపింప మా
తలిదండ్రుల్ నిలయంబునం దిడక పంతంబారఁ బోఁదోల నీ
చెలికత్తెల్ మతి మీర లందఱును ఛీఛీ యంచు దూషింప నీ
వల జేసి న్నగువాని కౌఁగిటను నే వాలంబు గ్రీడించెదన్. 52

వ. అని కనరుగనంబడం బలికిన నళికీ చెలికత్తియ లాండ్రొండొరులమొగంబులు చూచు
కొనువారును, గుజగుజలం బోవువారును, నళించువారును, నిసడించువారును,
నిది మిడిమేళం బనువారును నై యుండి యలసి కొంతతడవున కించుక గనుమూసి
నిదురింపం దొడంగి రాసమయంబున. 53

క. సంగయయుఁ గడితప్రభువచ్చె, నంగజు మానుంగిడి కడిందిబాణాళిసమున నా
శృంగారవనికి వెళ్లెను, జంగమపుంగవుని వెనుకఁజనియె నొకత్తె. 54

వ. అట్లు చని వనిం బ్రవేశించి. 55

సీ. కొదుగక గాటంపుఁ బొదరిండ్లదండలఁ గొదకొని సాకెప వెదకి వెదకి
తిన్ననికపురంపుఁదిప్పలచొప్పల నిలుచుచు నందంద నెమకి నెమకి
వలపుఁ గొజ్జఁగినీటివంతల చెంతల డాసి పద్దెలఁగుల రోసి రోసి
పరువంపువలిదాఁకపందిళ్లసందుల సొలయుచు మఱిమఱిఁ జూచి చూచి

గీ. వలపు లంతంత కుబ్బ నవ్వాన్నె కాని
నెందుఁ బొడఁగాననేరక కుంది కుంది
యిందువదన వనీతరుబృందములను
ఆశ లడరంగ నిట్లని యడుగఁదొడఁగె. 56

సీ. చిన్నారివగకాఁడు చెన్నార మీవద్ద నిలిచియుండఁడుగదా నిమ్మలార
సింగారములకుప్ప చెలువొప్ప మీచెండ మొనసియుండఁడుగదా పనసలార
ముద్దుజంగమకాఁడు మరిమీఱ మీపజ్జ మసలియుండఁడుగదా మావులార
నెఱజాణతలమిన్న నీటార మీచెంత దాఁగియుండఁడుగదా దబ్బలార

గీ. యలరువిలుకానిఁ దెగడుసోయగము గలిగి
కడిఁదిమీచాయనిగ్గులు కడలఁ బర్వ
జగములెల్లను వలయించుజగముగండు
మీకడకు రాఁడు గద వలిదాఁకలార. 57

క. ఈ డెన్నరానిసొగసుల, నాడెందము గరఁగఁజేసి నలిఁ బెట్టినయా
పోడలతలమానిక మిపు, డీడా పసిడ కీడ కేతేరఁడుగా. 58

క. అన్నన్న కడిఁదివగలక్, నన్ను న్వలయించి చనుట న్యాయమె వానిం
గన్నారఁ జూపఁగదవే, పొన్నా నీ కెన్నరానిపుణ్యంబుగదే. 59

క. జగమెల్లను వలయింపఁగఁ, దగుసోయగమున వెలుంగుదంటవిరాళిం
బొగలించి చనియె వానిం, బొగడా గనఁజేయునీకుఁ బొగడికవచ్చున్. 60

గీ. తలిరువిల్కానిదాడికి వళికి యళికి, పలుదెఱంగుల నినుఁగోరి వలసియున్న
చెలియ వలయింపఁ దగదని తెలిపి వాని, నగుపడఁగఁజేయరే కొమ్మటనఁటులార. 61

వ. అని మఱియును జంగమేశ్వరుం గురించి యిట్లనియె. 62

ఉ. ఏలర యింతవింతచలమేలర నన్ను మనోభవానల
జ్వాలలవేఁడిమిం బొగలఁ జాలర తేజవరాలరా మదిం

జాలి దిగుల్గఁగసల్కాఁడనియు జాలము సేయక వేగవచ్చి నా
ప్రాలఁ గనంబడంగదర ముద్దులజంగమరాయ మ్రొక్కెదన్. 63

ఉ. పొంగుచు నీముఖాంబుజము ప్రొద్దునఁ జూచినవేళ దొట్టినో
యంగజుఁ డెంతయుం గుపితుఁడై వెనుదీయక యేఁచఁజొచ్చె న
న్నంగవలం గలంచి యిటురా రెదఁబెట్టెద వేల చాల నీ
సంగతిఁ గోరుకొంటిఁగదె జంగమరాయవిలాసభాసురా. 64

గీ. అనుచు వనమెల్లఁ ద్రిమ్మరి యందు నెచట, జంగమస్వామిఁ గానక గంగ యలసి
చాల నొప్పారుబాలరసాలసాల, మూలమునఁ గొంగుపఱచి కన్మూసియుండె. 65

క. మరుఁ డప్పు డిందీవరశర, సరసిజసితోత్పలామ్రశితవిశిఖంబుల్
పొరిఁబొరి వెడవింటఁ దొడిగి, కరిగామినిఁ బింజెపింజె గాఁడఁగ నేసెన్. 66

క. అటు వేసిన హా యని యు, త్కటకీలాలత సోలి తెలిసి కుసుమాస్త్రనిశా
విటమధుకరహంసపికా, రటమలయానిలములఁ గినుక ప్రబ్బఁగఁ బలికెన్. 67

గీ. పార్వతీశంకరులమీఁదఁ బఱచి యున్న, బన్నమందిన సుద్దిలోపలను మఱచి
యిపుడు నామీఁదఁ దొడిగెద విక్షుచాప, యింక నీవేమి యయ్యెదో యెఱుఁగరాదు.

క. సోమా నీవును నేనును, గామాంతకుశిరముమీఁదఁ గలసి మెలసి మున్
ప్రేమమున నుండు మిప్పుడు, నామీఁద న్వేఁడిచూప నాయమె నీకున్. 69

సీ. మరుని శంభునికంటిమంట మ్రింగెడునాఁడు తాఁటి మీ రేబొక్క దూఱినారు
దర్పకుఁ డభవుచే దగ్ధుఁడయ్యెడునాఁడు తలఁగి మీ రేయేటఁ గలసినారు
వలరాజు హరునిచే నలిగిపోయిననాఁడు నురిగి మీ రేకోనఁ జొచ్చినారు
మదనుఁ డీశ్వరునిచే మడిసి పోయిననాఁడు పారి మీ రేతిప్పఁ బట్టినారు

గీ. వాఁడు గ్రమ్మర జీవించి వచ్చినపుడు
సిగ్గుతే కిట్లు పంబడిఁ జేరినారు
మధుపచక్రాంగపరభృతములు పవను
లార గణుతింపఁదరమె మీబీర మిపుడు. 70

వ. అని యనివారితానంగసంతాపాటోపంబునం బొరలుచుండె నంత. 71

గీ. అత్తగృహమున నక్కడ ననుఁగుచెలులు, త్రుళ్లిపడి లేచి సెజ్జయు నెల్లచోట్లు
వెదకి గంగను గానక వెఱఁగుమీఱి, వరుస నందఱు శృంగారవనము సొచ్చి. 72

సీ. కందర్పశరబాధఁ గుందుచు నందంద శివశివా యని సద్దు సేయుదానిఁ
బొగలుచు గడితంపుబుడిబుడిపేఁడికన్నీటిజాల్ కొనగోర మీటుదాని
నెందు నలుక్కడువిన్నఁ బొందుగాఁ జెవియొగ్గి పొంచి నల్గడ లాలకించుదానిఁ
బొరిఁబొరి నిలమీఁద బొరలుచు లేచుచు నుసురంచు నిట్టూర్పు లుచ్చుదానిఁ

క. కుల్లమునఁ గలపెద్దలు విని, వెలిపెట్టినఁ గూడి పొత్తు విడిచ్చాడిన హా
తలవంపు లయ్యెడుంగద, చెలియా యీలాటిబుద్ధి చెల్లునె నీకున్. 85

క. కులమును రూపంబును గల, చెలువుని రప్పించి పెండ్లిసేసెద నీకున్
జలజాక్షి గానిబుద్ధులు, వలదిఁక నామాట వినుము వాలాయముగన్. 86

వ. అనినం దండ్రికి గంగ యిట్లనియె. 87

ఉ. పొంగుచు మూఁడులోకములఁ బూనికతో విహరించి పాపముల్
భంగ మొనర్చుచు న్భువనపావని నా విలసిల్లుజాహ్నవీ
గంగను గాని నే మనుజకన్యను గాను సజం బతెంతునన్
జంగమవాఁడు గాఁ డల భుజంగమరాజకలాపుఁ డారయన్. 88

గీ. తండ్రి యిమ్మాటఁ గొంతచిత్తమున సవ్యతింగినది గాక యూరక యిచ్చపడక
యతనిరప్పించి పెస వివాహం బొసర్చ, నిఖిలవాంఛాఫలంబులు నీకుఁ గలుగు.

క. ఇటువలెఁ గాకుండిన నా, నిటలాక్షుని పాద మాన నీయాన మహేం
తటిబలవంతుని నైనను, గటకట నే నంత వొరుని గాంతుం బ్రదు నే. 90

వ. అనిన సంతసిల్లి శంఖదేవుండు వెండియుఁ గూఁతున కిట్లనియె. 91

గీ. అమ్మ యిమ్మాట నిక్కువం బయ్యెనేని
నతఁడు నిజమూర్తిఁ జూపించి యఖిలదివిజ
వరములఁ గూడి యింటికి వచ్చెనేని
ప్రేమ దైవార నే నిన్నుఁ బెండ్లిసేతు. 92

క. విను మూరక నిన్నొసఁగిన, జనులందఱు నవ్వఁ గులము సాములు నన్నుం
గనుఁగొని యెగ్గులు పల్కరె, వనితా నీ వెఱుఁగనట్టివల నీకుఁ గలదే. 93

ఆ. అనిన సంతసిల్లి యప్పుడు గంగాభ, వాని యభవు నాత్మలోనఁ దలఁచి
కరయుగంబు మోడ్చి స్థిరభక్తి దైవార, వినయసరణి నిట్లు లనుచుఁ బలికె. 94

సీ. సకలలోకారాధ్య సర్వజ్ఞ సర్వేశ గిరిసుతాప్రాణేశ దురితనాశ
భూతభావన పరంజ్యోతిస్వరూప మహాదేవ శంకర హరమహేశ
జగదవనాధార నిగమాంతసంచార ఫాలలోచన భర్గ నీలకంఠ
నందివాహన భృంగినాట్యప్రమోద గీర్వాణసంస్తుత్య పురాణపురుష

గీ. నాదబిందుకళామయ వేదవేద్య, చక్రధర బాణభక్తరక్షాధురీణ
నామనోనాథ కైలాసనగనివాస, వేడ్క నవధారు దేవ నావిన్నపంబు. 95

గీ. దేవ మాతండ్రి యగుశంఖదేవుఁ డిపుడు, నాకు నీకును బెండ్లి యొనర్పఁ గోరి
తివురుచున్నాఁడు బ్రహ్మాదిదివిజవరులు, దవిలి గొలువంగ వేవేగఁ దరలిరమ్ము. 96

గీ. శివ నామీఁద ప్రేమంబు నెరయఁ గల్గె నేని నే నీకుఁ బ్రియురాల నేని యిప్డె
వేడ్క వైవాహికోత్సవవిధి వెలయఁ, జలిపి నామాట సత్యంబు నెరపవయ్య. 97

వ. అని గంగ ప్రార్థింపుచున్న సమయంబున. 98

సీ. హరియు బ్రహ్మయుఁ బురందరముఖ్యదిక్పతుల్ రవిసుధాకరముఖగ్రహపతులును
సనకాదియోగిపుంగవులు వశిష్ఠాత్రిముఖ్యోత్తమమునివరులు
వీరభద్ర కుమార భైరవభృంగిరిటాదిప్రమథనాథు లప్సరసలు
గరుడకిన్నరయక్షగంధర్వఖచరగుహ్యక నాగసిద్ధవిద్యాధరులును

గీ. బలసి కొలువంగ నసమవైభవముతోడ, నందికేశ్వరు నెక్కి యానందలీల
సకలలోకాధిపతి యైనసాంబశివుఁడు, దాసకులవాలి మ్రోలఁ బ్రత్యక్షమయ్యె. 99

వ. అట్లు సాక్షాత్కరించిన దాక్షాయణీవల్లభుం బొడఁగాంచి పులకితాశేషావయవుం
డును, నిర్భరానందరసోత్ఫుల్లనేత్రుండును, విస్మయాకులస్వాంతుండును నగుచు
దాసకులజ్యేష్ఠుండు సాష్టాంగదండప్రణామంబులు గావించి బహుప్రకారంబుల
వినుతించి కృతాంజలి యై యిట్లనియె. 100

గీ. అధవ నాభాగ్యమహిమ శక్యంబె పొగడ, హరిపురందరకమలాసనాదులకును
గనఁబడగరానినిన్ను నేఁ గంటి నిపుడు, పావనం బయ్యె నహహ నావంగడంబు.

గీ. నీచకులయింటి కిప్పుడు నీవు వచ్చి, యొసరఁ గన్యార్థి వై నిల్చియున్నవాఁడ
వే తెఱంగున నిన్ను సంప్రీతుఁ జేసి, యనుపఁ గలవాఁడనయ్య చంద్రోత్తమాంగ.

వ. అని విన్నవించి యొక్కదివ్యమణిమయమందిరంబున విడియించి, సకలబుధబాంధ
వామాత్యపురోహితసుహృజ్జనంబుల రావించి, శుభముహూర్తంబు నిర్ణయించి,
నిజగృహాదికం బలంకరించి తదనంతరంబున. 103

సీ. శుభతూర్యనినదంబు లభినవస్థితి మ్రోయఁ గరదీపికానముత్కరము వెలుఁగ
ద్విజసతీమణులు ముత్తైపు సేసఁబ్రాల్ సల్ల సర్వేసు శేంద్రు లాశీర్వదింప
గణికానికాయ మఙ్గలికనృత్యంబాడ వనజాతముఖులు నివాళు లొసఁగ
వందిమాగధులు కైవారంబు లొనరింప గాయకుల్ గానవైఖరులు నెరప

గీ. మంగళద్రవ్యములఁ గొంచు మతియుఁ బుణ్య
కాంత లరుదేర నత్యంతకౌతుకమున
సకలబుధబాంధవాశ్రితసహితుఁ డగుచు
భవు నెదుర్కొనె నైవర్తపతిభృత్యుండు. 104

వ. అప్పుడు మహాదేవుండు దివ్యదుందుభిధ్వానంబులును, గంధర్వకిన్నరగానంబులును,
రంభోర్వశీప్రముఖాప్సరస్సరోజాస్యాలాస్యావధానంబులును, జండీశ్వరప్రపఠిత

గద్యపద్యవిధానంబులును, దివిజరథప్రవర్షిత దేవతరుప్రసూనవర్షంబులును, దేవవిమా
నంబులును, నిరంతరమహోత్సవలీలాముహూర్తప్రవృత్తమధభటసంతానంబులును,
బృందారకసుందరీసందోహ పరివేష్టితచిత్రపురీప్రాసాదంబులును, ననూనంబులై
చెలంగ నందికేశ్వరారూఢుండై, యఖిలవైభవంబున శంఖదేవునగరు ప్రవేశించి,
యచ్చట వాహనంబు డిగ్గి, వివాహమంటపాభ్యంతరంబు సొచ్చి, సముచిత
పీఠాగ్రంబున సుఖాసీనుండై యున్న సమయంబున. 105

ఉ. అంగన లొక్కకొందఱు ప్రయత్నముతోడ నలంకరించి యా
తుంగవివాహవేదికి వధూమణిఁ దోడ్కొనితెచ్చి వేడ్కను
ప్పొంగుచు నున్న సామవిదులౌ భూసురముఖ్యులు నప్పురాంతకున్
గంగను బెండ్లిపీఁట నిడి కంకణముల్ దగఁ గట్టిరంతటన్. 106

గీ. శంఖదేవుండు దేవతాసార్వభౌముఁ
డగుమహాదేవునకుఁ బ్రియం బలరఁ గాళ్లు
గడిగి తనముద్దుబిడ్డను గంగ నపుడు
ధారవోసె నిలింపబృందములు వొగడ. 107

వ. అప్పుడు. 108

సీ. సిరియును వాణియుఁ జెలఁగి సేసలఁ జల్ల గురుఁ డొజ్జయై లగ్న మరసి తెలుప
హరియు బ్రహ్మయుఁ బెద్దలై పనుల్ సమకూర్ప శ్రుతివాక్యములు వసిష్ఠుఁడు పఠింప
శచియు నరుంధతీసతి నివాళు లొసంగ రంభోర్వశులు వింత రవళి నాడఁ
దుంబురునారదుల్ దొడరి గానము సేయ దేవదుందుభులు మేల్ దీవి మొఱయ
గీ. హర్షమున విశ్వకర్మ దా నంది యిచ్చు, కనకమంగళసూత్రంబు గంగయురతఁ
గట్టి శుభమొందె ననసూనగరిమ మెఱయ, సకలభువనాధిపతి యైనశంకరుండు.

గీ. వారునితలన్ గంగయు న, క్షతరుచిరంబున హరుండు దమిమీఱఁగ వా
విరియుత్తైపుఁదలఁబ్రాలు వ్యోమసీమ విబుధగవులు దలిర్ప శివకరలీలన్. 110

వ. అట్లు విధ్యుక్తప్రకారంబున వివాహంబు గావించి, కంకణబంధంబు వెడలించి యా
న్నంత నొక్కనాఁ డొక్కశుభముహూర్తంబున. 111

సీ. ఘనసారహిమనీరగంధసారమసారమృగనాభికామోదమేదురంబు
మణిమయపర్యంకమంజూషికాసాలభంజికాపుంజవిభ్రాజితంబు
తపనీయముక్తావితానకళావికాస్యజనదర్పణచామరావృతంబు
కాలాగరుదశాంకకాళికసాంబ్రాణికాధూపవాసనాగంధిలంబు
గీ. వీటికాపేటికాజాలవిలసితంబు, కజ్జలకరండమండలాఖండరత్న
దీపసంతానదీపికోద్దీపితంబు, నైనయొక కేళికాగృహాభ్యంతరమున. 112

క. మదనవిభంజనుఁ బతిస, మ్మదహృదయాంబుజములఁ దగుచు మహిళామణికై
యొదుగెడుఁ జూపుచుండఁగ, మదనుఁడు లోకకొండ రపు దమంద్రెముదన్. 113

గీ. బాలికామణిఁ గైసేసి పడకటింటి, కెలమిఁ దోడుకొనిపోవని యుంచువారి
యొద్దఁ గడియించి తమ్ములం బొసఁగఁజేసి, చనిరి సన్నకసన్న నాశంభుఁ డప్పుడు.

గీ. చిగురుఁబోఁడిని సెజ్జఁ దిగిచి బుజ్జ
గించి కౌఁగిటఁ జేర్చి కోర్కెలు దలిర్పఁ
గామశాస్త్రోక్తనియతి నక్కంజముఖిని
రతులఁ గరఁగించి సుఖలీలఁ గ్రాలుచుండె. 115

వ. అట్లు నవోఢాసంగమసౌఖ్యానుభవలీలావైభవంబునం జెలంగుచుఁ, గొన్ని వాసరంబు లచట నుండి, యంతట నొక్కనాఁడు యథాస్థానంబునకు వేంచేయ నుద్యోగించి, మహాదేవుండు శంఖదేవున కత్తెఱం గెఱింగించిన నతం డిట్లని విన్నవించె.

క. దేవా నాకుల మెల్లను, బావనమై వెలసె భక్తపాలన విద్యా
ప్రావీణ్యం బేర్పడఁగా, నీ విచ్చటికి దయ గుదెంచి నిలుచుటకతనన్. 117

గీ. దేవ మాయింట నెప్పుడు నీవు నిలిచి, యుండవలె ననుకోర్కె లో నుండు నాకు
వెలయ నిమ్మాట మీతోడ విన్నవింప, నింక మీచిత్త మెట్టిదో యెఱుఁగ నేర. 118

క. మా కిట నీ వల్లుఁడవై, ప్రాకటగతి నిలిచియున్న భాగ్యంబునకున్
లోకు లెఱుంగఁగ నన్నుం, జేకొని ధన్యునిగఁ జేయు శితకరమకుటా. 119

ఆ. అనిన మెచ్చి శంభుఁ డటులే నిదివ్యజ, లాపహారలింగరూపి నగుచు
నీగృహమున నుండు నిశ్చలభక్తితో, నన్ను గొలుచుచుండు నయవిచార. 120

వ. అని యతండు గోరినట్లనె కృపఁజేసి మన్నించి యతని నచ్చట నుండ నియమించి మహోత్సాహంబున. 121

గీ. అభవుఁ డప్పుడు దివ్యదుందుభులు మొఱయఁ
బ్రమథవరులును దివిజులు బలసి కొలువ
గంగతోఁగూడి వృషరాజగమనుఁ డగుచు
లీల వేంచేసెఁ గైలాసశైలమునకు. 122

ఉ. అంతకమున్న నారదమహామునివర్యుఁడు వెండికొండ కే
కాంతముగాఁగ నేఁగి గిరికన్యక గన్గొని యంబ శూలి దా
సంతసమొప్ప గంగ యనుజాతిరికన్నియఁ బెండ్లియాడి నీ
చెంతకు వచ్చుచుండె నిదె చెప్పితి నీకు సవిస్తరంబుగన్. 123

క. అని దివిజమునివరేణ్యుఁడు, వినిపించి యథేచ్ఛ జనిన విస్మయ మొదవన్
మనమున హిమవద్భూధర, తనయ దిగులొంది తద్దఁ దలఁకుచు నుండెన్. 124

సీ. అంతట శంకరుఁ డఖిలామరుల యథాస్థానంబులకుఁ బంచి సరభసముగ
గౌరికి వెఱచి యాగంగను జడలలో నిడుకొని నగరున కేఁగుటయును
గౌరకౌరతోడ నక్క్రూధరేంద్రనందన తలుపులు బంధించి చల మెలర్ప
మీనాంకదమనుని లోనికి రాకుండ నతికఠినోక్తుల నాడుచున్న

గీ. మదిఁ గలంగి పురారి యమ్మధురవాణి, కిట్లు లని పల్కె నహాహా నీ కిట్టికినుక
యేల నామీఁదఁ బొడమె నే నేమితప్పు, జేసితి వచింపఁగదవె నాచెంత నిపుడు.

క. భక్తపరాధీనుఁడ నే, భక్తుల వరయంగఁ గోరి ప్రతిదివసము నా
సక్తిని జరుగుచు నుండుదు, వ్యక్తావ్యక్తుండ నగుచు వనజాతముఖీ. 126

వ. కావున నాకుం దప్పుగా విచారించి కవాటబంధనం బొనరించు టుచితంబె
యనిన నతనికి భవాని యిట్లనియె. 127

గీ. ఎచటి కేగితి విందాఁక నెచట నుంటి, వెవ్వఁడవు నీవు నీ తెఱం గెఱుంగఁ
గ్రొత్తపెండ్లికొడుకుపలాసునఁ గడింది, సొగసు గైకొనియున్నావు చూడ నిపుడు.

గీ. తివిరి కామాంధకారివై తిరుగుచుంట, నేను నీ జాడ యింతయును నెఱుఁగరాదు
తెలియఁజెప్పు మటన్న నద్దేవితోడ, నిందురేఖాశిఖామణి యిట్లు లనియె. 129

క. పర్వేందువదన విను మే, సర్వజ్ఞుఁడ నహాహా మేలు సర్వజ్ఞునిపై
నుర్విని జను లెవ్వారును, ఖర్వమతిం దలఁగి పోరుగద పరికింపన్. 130

గీ. నీలకంఠుండ నే వారిజలపాణి, నీ నెమిలిఁ గోరుకొని వచ్చి నిలిచినాఁడ
నార యమ్మే ల్నీలకంఠుఁడ వైతివేని, కేకి లిచట లేవు వేగంబె గిరికిఁ జనుము. 131

క. క్రీడాకిరాతుఁడను నేఁ, జేడియ యటులైన నీవు జింకలు పులులుం
గ్రోడంబులు గలయడవికిఁ, బోడిమితో వేఁటలాడఁ బొమ్మా నెమ్మిన్. 132

సీ. అబల నేఁ బశుపతి నహాహా నీవట్టైన నాలమందకు నంకె లడరఁ జనుము
స్థాణుఁడ నేను గంజాతాక్షి యబ్బబ్బ మోడు మాటాడుట చూడ మెంచుఁ
బురసంహారుఁడ నేను బొలఁతి నీవట్టైన మావీట నుండక మరలి పొమ్ము
పన్నగధరుఁడను బడఁతి నేనట్టైనఁ బడిగె లెత్తుచు నూళ్లఁ బడి తిరుగుము

గీ. భూతనాథుఁడ నేను బూఁబోఁడి యట్లు, లేని నల ప్రేతభూముల కేగు మిపుడె
కుటిలకుంతల నే మహానటుఁడ నట్టు, లైనఁ బ్రభువుల కడ కేఁగి యాడు మెలమి.

క. చిగురాకుఁబోఁడి విను మే, నగవాసుఁడ నట్టులొదవినఁ జెక్కలతో
గగనమున కెగసి చెట్లును, జగత్స్థితి నిలుపఁబోక చనుమా వేగన్. 134

గీ. విను విరూపాక్షుఁ డను నేను వనజవదన, యహాహా బుధులు విరూపాక్షుఁడైనవానిఁ
జూడరాదని తఱుచుగ నాడుచుంద్రు, తొలఁగి వేంచేయు మిటఁ జెక్కుపలుకులేల.

గీ. అనుచుఁ దానాడుమాటలకగతనూజ, పొసఁగఁగల్పించియుత్తరంబొసఁగుటేను
దలఁకి యూర్ధ్వనీహారధామముఖికిఁ, గాలకంధరుఁడు నమ్మికగా వచించె. 136

గీ. తెలుప నే నేమి పాపంబు నెఱుఁగ నివ్వ, ఎట్టికష్టాలు నామీఁదఁ గట్టి యిట్లు
గలఁక నొందింపనేల యాగ్రహము మాని, వినుము నామాట యొక్కటి వీనులలర.

సీ. నవఁబోఁడి నామాట నమ్మకుంటివిజేనిఁ జెనకి బెబ్బులివాఁతఁ జెయ్యిడెదను
గట్టిగాఁ బెనుబాముఁ బట్టి యాడించెద విషమైన మ్రింగెద వెఱపులేక
కాదుగక వడిఁ బెద్ద గుడి సొచ్చి నిలిచెద నవనీల గోపనం బంటుకొనెద
నంకిలి లేకుండ నగ్గి ధరించెదఁ బట్టుగా ద్విజరాజు ముట్టుకొనెద

గీ. మఱియు నేబాసయైన నేమమునఁ జేతుఁ, గాన నింక నితలంపులో మాని మాని
సతిశిరోమణి నన్ను మన్నింపు మిప్పు, డెలమితోడుతఁ గదియించి యేలుకొనుము.

గీ. అనిన నంబిక యొక్కింత యాత్మ నలరి, యతని కిట్టి బాసలు నచ్చివచ్చుఁ
బలుకు లేటికి రమ్మని తలుపు దీసి, పిలుచుటయు నేఁగి యతఁ డొద్ద నిలుచుటయును.

గీ. అతనిసంభోగచిహ్నంబు లరసి చూచి, పార్వతీదేవి యిట్లనిపల్కె నహహ
యిప్పుడే నేమి పాపంబు నెఱుఁగనంటి, వేచటివీ చిహ్నములు నాకు నెఱుఁగఁజెపుము.

క. పసుపును గుంకుమగంధము, నసవంబట నీదు మేన నట్టువదలి యే
బిసరుహముఖి యంటించెనొ, కసరక నాతోడ నిపుడు గట్టిగఁ జెపుమా. 141

వ. అనిన భవుం డిట్లనియె. 142

క. విను మానిని జనులందఱు, వెనుకయ్యను బూజసేయ వెస నాతఁడు నన్
బెనఁగి కవుంగిటఁ బొదవినఁ, దనువున నవి యంటుకొనియెఁ దప్పే నాకున్.

గీ. కాలకంధర నీమోవిగంటు లేమి, కారణంబునఁ బొదవె నా గౌరి వినుము
మరునితోడ నెదిర్చి సంగర మొనర్చు, తఱిని గోపించి కీరంబు గఱచెఁ జుమ్ము.

క. హాటకగిరిధర నీమెయిఁ, గాటుక యంటిన దదేమికారణ మబలా
కాటుక కాదిక లత్తుక, గాటపుగరళప్రభావికాసము సుమ్మీ.

క. మే లెంతటి నెఱజాణవొ, బాళిగ దత్తురములాడి వంచింపెదవో
బాలేందుజూట నీమెయిఁ, బూ అంటుకయున్న వేల పొంకక చెపుమా. 146

గీ. భామ విను మున్న శ్వేతుఁ డన్భక్తవరుఁడు, వెలవెలందికిఁ బూల్గాంచు వెడలు నెడల
గొన్ని మహిమీఁద వ్రాలినఁ గోరి వాఁడు, నాకు నర్పింప నవి యంటె నాటుకొనియె.

క. పన్నగరాజాంగద నీ, కన్నుల కెఱుపేలగలిగె గౌరీభక్తుల్
నిన్నర్ధరాత్రివఱకు, నన్ను జాగరణ మొనిచినం బొసఁగె నిటుల్. 148

గీ. అంచు నిరువురు నిటు భాషింపుచుఁడ జేని, శివశంకరుండు మోహంబు నిలుపలేక

సర్వమంగళీచరణకంజములమీఁద, వ్రాలె నన్నుద్ధరింపవే వనిత యనుచు 149

క. వ్రాలినఁ గనుఁగొని గిరిసుత, మే లహహా జాణ వగుదు మెచ్చితి నిన్నున్
లే లెమ్మనుచుం గౌఁగిటఁ, గీలించి విభునిమనోజకేళిం దేర్చెన్. 150

వ. అట్లుమామహేశ్వరు లన్యోన్యానురాగంబు లినుమడింప నఖండమహావైభవంబునఁ బ్రమోదింపుచుండి రొక్కనాఁడు. 151

క. వేడబ మొప్పఁగ నెత్తం, బాడుచు నున్నంత గిరిజయాటకు లోనై
యోడి శివుఁ డూరకుండిన, క్రీడామోదమున గౌరి కిలకిల నవ్వెన్. 152

వ. అప్పు డమ్మహాదేవియౌద్ధత్యంబు సహింపలేక శివజటాగ్రంబున గంగ తొంగి చూచిన దానిం గనుంగొని భవాని శంకరుని మొగంబు చూచి యిట్లనియె. 153

గీ. ఏమి పాపం బొకింత నే నెఱుఁగనంటి, వహహా యీ కెంజడలలోన నడఁగి తొంగి
తొంగి చూచుచు నున్న యేధూర్తసతియొ, దానిచందంబు తెలుపుమా తడయ కిపుడు.

క. మును దారుకావనంబున, మునిదారల భ్రమలఁ బెట్టి మోహింపఁగఁ జే
సినమేటివన్నెకాఁడవు, నినుఁ జెప్పఁగ నేల యింక నేఁడు వృషాంకా. 155

క. భల్లాణరాజుకూరిమి, యిల్లాలై కడిఁదిహొయల నింపొందినయా
చెల్లాంబం గామించిన, బల్లిదుఁడవు నీహొరంగు పలుకం దరమే. 156

గీ. సురల నసురుల నమృతంబు సరుదుకొనఁగ, లేక పోరాడుచోఁ జక్రిలీల నొక్క
నెలఁతయై పంచి యిడుచున్న నీవు దాని, వెంటఁబడి పర్వెత్తవె వేడబమున. 157

వ. అని మఱియు నిట్లనియె. 158

ఉ. అక్కట నీవు నన్నిటుల నారడిఁ బెట్టి కలంపఁ జూచుటల్
నిక్కము గా మదిం దెలియనేరక యూరక మోసపోతి నిం
కెక్కడిసత్యశౌచములు హీనకులంబు వెలందిఁ బెండ్లియై
దక్కఁగ నెత్తిఁ బెట్టుకొని టక్కులు పల్కెద వేమి చెప్పుదున్. 159

గీ. తివిరి నామీఁద నొక్కతె దెచ్చి యిపుడు, లేదు లేదని బొంకుపల్కెద వయారె
దానిఁ గ్రిందికి దించి నాదట్టిని నిల్పి, మాటలాడించుమా యింక మఱుగు లేల. 160

క. తగులమి యొకచోఁ దక్కరి, వగ లొకచోఁ బెరయఁ జెలులు వంచింతురు గ
ట్టిగ నెట్టి బాసచేసిన, మగవారిని నమ్మరాదు మాట లిఁకేలా. 161

వ. అని పలుకుచున్న సమయంబున. 162

క. నిగిడెడు కోరకోరతోడన్, మొగ మించుక చేవురింపఁ బోణిమి నబ్రం
బుగ నగభవ నునిగడితేఁపు, సిగలోపలనుండి గంగ చివ్వున నుతికెన్. 163

వ. అప్పుడు భవాని దానిం గనుంగొని యిట్లనియె. 164

క. ఎక్కడిదానవె నీ వెను, బక్కజమున నాప్యాదిశునాఁదలచెదవెం
తెక్కుఁగ వచ్చితి యిప్పుడు, చిక్కఁగ నుపేక్షింపి బుద్ధి సెప్పెదఁ జూమ్మీ. 165

క. నీ వెక్కడ నే నెక్కడ, భావజహరుఁ డెచట నోని పరఁగంగ నిఁకన్
గావర మడఁగి చటులాఁగన్, సేవేగ మడఁగుచుఁ బు వెలువడి పొమ్మా. 166

క. పోకుంటివేని నిన్నుం, బాకాసులనవంత్త్రిబుధరాజోత్తయులన్
దిక్కాలిపి ప్రోలు వెడలఁగ, నాకించెదఁ జూమీ చలంబు నాలుకొనంగన్. 167

వ. అనినం బార్వతీ దేవికి భాగీరథి యిట్లనియె. 168

గీ. అక్కరో యిట్టిమాటల నాడఁ జెల్లు, నీవు శంభునిఁ గోరి మున్నె విధమున
వచ్చి చేకొనఁదలఁచుచున్నావో వంతెనుగను, నేను నటువలె వచ్చినదానఁ జావ్వె. 169

క. చిగురాకుఁబోఁడ్లకెల్లను, మగఁ డేవాఁ డగను హోటిమక్కువతోడన్
సగమేన నిల్పుకొన్నను, నిగలో నిడుకొన్నఁ జెల్లుఁగదమ్మా. 170

వ. అనిన భవాని దాని కిట్లనియె. 171

క. మేలహహా యెంతటిగ, య్యాళివై చేరినటులుండ కఱచెదవు కడుం
గాలికి వచ్చినయాతఁడు, వాలికిఁ బట్టిన క్రియ న్విపర్యాసముగన్. 172

ఆ. అడుగునిలుపనీక నడికొట్టుచు ప్రచ్చు, నింగిముట్టి మిగులఁ బొంగెదేమి
గట్టివాతనంబు గనఁబడనా నె నీ, నిలుపు నిరుసాను నిచుబాల. 173

వ. అనిన గంగ యిట్లనియె. 174

ఆ. పెద్దదాన ననుచుఁ బెళపెళ నార్చుచు, జగములెల్ల మ్రింగఁ జాలునట్టి
సత్తిరూపు పూని జడిపింపవచ్చెదు, కినుక నిగుడ నీవు గిరితనూజ. 175

వ. అనిన హైమవతి యిట్లనియె. 176

గీ. నిచ్చనిచ్చలుఁ బంకంబు నిర్వటిల్లఁ, గోరి మితిలేనిజలచరకోట్లలోన
నడచుకొనియుండు చెనటు వయారె నీవు, నన్ను నెదిరింప నెట్టిదానవె ఛటారి. 177

ఆ. వక్రగతులచేత వాలెంబుఁ బెక్కుత్రో, వల వెలుంగుచుండి కలఁక నిగుడఁ
దూలి మొరసెదేమి దుష్కీర్తి బొడవి నీ, ప్రతుకు శైలుగాను పలుకవదాన. 178

క. అనిన జాహ్నవి గిరిసుతఁ, గనుఁగొని యిట్లనియె నీవు ఘనుశూలవె మేల్
మను చండికవై యొకకొ, యెనుపోతును జంపి దానిహింతమతిఁ గొనవే. 179

గీ. సకియ యూరూర జేశదేశముల బెద్ద, సత్తివై నిల్చి కూళ్లును శాకములును
గోళ్లు గొరియలు గుగ్గిళ్లు కుడుము లట్లు, దనివిసన మెక్కుకడుపుబద్దరివి గదవె.

వ. అనిన నంబిక యిట్లనియె. 181

గీ. ఓసి గంగయ్యాళి నీ కింతరోస మేల, చెడుగుజాలారివానింటఁ బొడమి బిట్టు
చేఁప జెల్లలు దిని మేను చెందకున్న, పరికెతవు నీవు నాతోడ సరియె చెప్పుము.

వ. అనిన భాగీరథి యిట్లనియె. 183

గీ. అప్పరో యింక నీగుట్టు చెప్పనేల, కల్లు గంజాయి నంజుడు నెల్లప్రొద్దు
బాలిగాఁ దిను కడజాతివానియింటఁ, బుట్టితివో లేదో చెప్పుమా గట్టిగాను. 184

వ. అని యిత్తెఱంగున నిరువురు వాదింపుచున్న సమయంబునఁ గాత్యాయనీదేవి మహా
దేవుని మొగంబు సూచి యిట్లనియె. 185

గీ. అకట సామీ యీవ నీవిప్రుఁడొకతెఁ దెచ్చి, కాద మొదవించి యెఱుఁగనివానిఁ బోలెఁ
జూచుచున్నాఁడ వింక నీచోష్ప దెలిసె నంచుఁ గోపించి చనుచున్న నళికి హరుఁడు.

గీ. వనితపదపద్మములమీఁద వ్రాలి నేను, దప్పసేసితి లోఁగొమ్ము దయ దలిర్ప
నిందుముఖి యింక నెఱుఁతుక లెందరున్న, నీవు పట్టంపుదేవివి గావె చెప్పుము. 187

వ. అని బుజ్జగించి గాఢాలింగనంబు గావించి గంగచేత భవానికి మ్రొక్కించి
వారిద్దఱిం గనుంగొని యిట్లనియె. 188

ఆ. ఒక్కచోటఁ బుట్టి యొక్కనిఁ జెంది మీ, లోన మీకు వైరమాని యిట్లు
పోరొనర్ప నేల పొలఁతుకలార మీ, రొద్దిమీఱఁ గూడియుండుఁ డింక. 189

క. అని నగసుత నర్ధాంగంబున జాహ్నవి నుత్తమాంగమున నిడి కపులా
సనముఖ్యులు గొలువఁగ శివుఁ, డనయము దవనిలవి జగము లేలుచు నుండెన్. 190

సీ. గడితంపుమువ్వన్నెకడిఁదిమృగత్వచియును బసమీఱుబంగారుపట్టుచేల
రుచిరాభినవచారురుద్రాక్షమాలికల్ మఱువైనహారమంజిముత్తెసరులు
భువజాభిరామవిభూత్యంగరాగంబు పారకౌశీరపటీరచర్చ
భూరిశోభాకీర్ణభుజగభూషణములు మణిమయతపనీయమండనములు

గీ. పాండురారుణవర్ణవిభ్రాజమాన, గాత్రమును గల్గి శృంగారగరిమ నలరు
నర్ధనారీశ్వరేశ్వరుఁ డభవుఁ డిందు, మౌళి భక్తాళి ననయంబు మనుచుచుండు.

గీ. అనుచు భీష్ముండు పాండుపుత్రునకు గంగ
కథ యెఱింగింప నలరి యాపృథుబలుండు
నిటలలోచనుఁ దలఁపున నిలిపి మ్రొక్కి
యతితరామోదహృదయుఁడై యలరుచుండె. 192

గీ. శాలివాహనశకవర్షసంఖ్యవసున, వాంగశశిసంజ్ఞ నలరుధాతాబ్దమునను
దగ రచించినయీకృతి ధరణియందు, నాసుధాకరతారార్క మగుచు నుండు.

క. వినుఁ డీకృతి ముప్పదియొక్క, దినమునకుం జెప్పినాఁడ దేవునియాన్

జను లెన్నఁ గుక్కుటేశ్వర, ఘనకరుణాదృష్టివలనఁ గవివరులారా. .. 194

క. ఈకథ చదివిన వ్రాసిన, బ్రాకటముగ విన్న జనుల పాపము లడఁగున్
జేకురు సకలసుఖంబులు, శ్రీకంఠునికరుణచేత సిద్ధము గాఁగన్. 195

## ఆశ్వాసాంతము.

చ. అతిబలదర్పశోషణ మహాహివిభూషణ సత్యభాషణా
సరసకృపానిరీక్షణ విచక్షణరక్షణ పుణ్యలక్షణా
హరిముఖనిర్జరావన విషాగ్నినిషేవన విశ్వభావనా
సరసిరుహాక్షసాయక లసత్ఫలదాయక లోకనాయకా. 196

## తోటకవృత్తము.

శివశంకర శాశ్వతశిష్టరతా, భవభర్గ సమాశ్రితభక్తహితా
దివిషజ్జనసేవిత ధీమహితా, వివిధాగమవందిత విశ్వనుతా. 197

## మాలినీవృత్తము.

ప్రముదితమునిజాలా భక్తలోకానుపాలా
శమసమదవిభంగా చారుగంగోత్తమాంగా
ప్రమథగణసనాథా పార్వతీప్రాణనాథా
కుముదహితకలాపా కుక్కుటాధీశరూపా. 108

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్ష నిరీక్షణ సంలబ్ధ సరసకవితా సామ్రాజ్యధురంధర, ఘనయశోబంధుర, కౌండిన్యసగోత్రపవిత్ర, కూచిమంచి గంగనామాత్యపుత్ర, సకలసంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామ తిమ్మకవి సార్వభౌమ ప్రణీతంబైన శివలీలావిలాసంబను శృంగారరస ప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

శివలీలావిలాసము సమాప్తము.

# ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది ... | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు ... | 0 | 2 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు, అత్యుత్తమప్రతి ... | 4 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు, లక్ష్మణకవికృతము | 1 | 4 |
| నిర్వచనోత్తర రామాయణము, సాధారణప్రతి ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు, | 2 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు ... | 3 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యము, కవనము బిక్కలిసొంపు, పీఠిక అతివిపులము ... | 5 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కఁగ ముద్రితము | 0 | 10 |
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి ... | 1 | 4 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 12 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాకితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రించియున్నాము ... | 2 | 0 |
| వసుచరిత్రవిమర్శనము, శ్రీ చివసీతారామస్వామిశాస్త్రి కృతము. అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు. ... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు ... | 3 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము ... | 8 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 10 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, పీఠికవిపులము ... | 2 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు ... | 2 | 4 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు ... | 2 | 4 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు ... | 1 | 0 |
| హరవిలాసము ... | 0 | 12 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు ... | 1 | 8 |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము ... | 0 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర ... | 1 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 10 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవిది ... | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| రంగారాయచరిత్ర, దిట్టకవి, నారాయణకవిప్రణీతము ... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు, రామభద్రకవికృతము ... | 1 | 4 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము ... | 0 | 4 |
| శివలీలావిలాసము, కూచిమంచి. తిమ్మకవికృతము ... | 0 | 6 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథప్రణీతము ... | 2 | 4 |
| చెన్నబసవపురాణము, సోమకవికృతము ... | 1 | 2 |
| పారిజాతాపహరణము, మూలప్రతి ... | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము ... | 0 | 12 |
| రసికజనమనోభిరామము ... | 0 | 12 |
| రాజశేఖరవిలాసము ... | 0 | 8 |
| సహస్రకంఠరామాయణము ... | 0 | 14 |
| బిల్హణీయము, చక్కానికూర్పు ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము ,, ... | 0 | 8 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము ... | 1 | 4 |
| తారాశశాంకవిజయము, చక్కానికూర్పు ... | 0 | 12 |
| హంసవింశతి, నారాయణామాత్యప్రణీతము ... | 0 | 14 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మది, చక్కానికూర్పు ... | 1 | 0 |
| రాజయోగసారము, ద్విపద ... | 0 | 4 |
| పంచతంత్రము, నారాయణకవికృతము ... | 0 | 12 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక ... | 3 | 8 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము; చక్కానికూర్పు ... | 1 | 0 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగడ, క్రొత్తకూర్పు ... | 0 | 12 |
| వైశ్యపురాణము ... | 1 | 4 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము ... | 0 | 10 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము ... | 0 | 12 |
| అనంతుని ఛందస్సు, ఛందోదర్పణము ... | 0 | 14 |
| వేమనపద్యములు, చక్కానికూర్పు ... | 0 | 6 |
| భాగవతసప్తమస్కంధము, సాధారణప్రతి ... | 0 | 6 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు ... | 1 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| శ్రీ శంకరాచార్య చరిత్ర | ... | 0 | 3 |
| శ్రీ వేమనయోగి జీవితము | ... | 0 | 2 |
| దాదాభాయి నౌరోజీ చరిత్ర | ... | 0 | 2 |
| శ్రీ కరంచంద్ గాంధి జీవితము | ... | 0 | 4 |
| శ్రీ గైక్వారు గారి జీవితము | ... | 0 | 2 |
| వివేకానందస్వామి జీవితము | ... | 0 | 2 |
| శ్రీ కృష్ణదేవరాయ చరిత్ర | ... | 0 | 3 |
| భోజునికథలు | ... | 0 | 8 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 8 |
| భేతాళునికథలు | ... | 0 | 8 |
| పరమానంద శిష్యులకథలు | ... | 0 | 3 |
| వైద్యులకథలు | ... | 0 | 4 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 6 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 4 |
| అయిదుగురు దొంగలకథ | ... | 0 | 6 |
| ఆంధ్రద్రావిడబాలశిక్ష, అరవ మభ్యసింపదలచు ఆంధ్రులకు మిక్కిలి యుపయోగము | ... | 0 | 3 |
| బాలవ్యాకరణము, చిన్నయసూరి గారిది | ... | 0 | 12 |
| వాసుదేవమననము, వచనము, మంచిఅచ్చు | ... | 0 | 10 |
| ఆంధ్రకన్నడబాలశిక్ష | ... | 0 | 3 |
| హింది ఇంగ్లీషు బాలశిక్ష | ... | 0 | 4 |
| హిందీ తెలుగు బాలబోధ | ... | 0 | 8 |
| వెంకయ్యవ్యాకరణము | ... | 0 | 4 |
| అద్వైతసంగ్రహము | ... | 0 | 2 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక | ... | 0 | 8 |
| ప్రౌఢవ్యాకరణము | ... | 0 | 12 |
| క్షేత్రయపదములు | ... | 0 | 14 |
| శబ్దార్థచంద్రిక, శ్రీ మహాకాళి సుబ్బారాయకృత ఆంధ్రనిఘంటువు | ... | 3 | 12 |
| నీలగిరిపాటలు, శ్రీ గురుజాడ అప్పారాయకృతము | ... | 0 | 6 |
| రామదాసుచరిత్ర, చక్కనికూర్పు, మంచికాగితములు, ఇందు శ్రీ రామదాసుగారి ప్రతిమకూడకలదు | ... | 0 | 12 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు | ... | 0 | 10 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.